# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 23 జులై 1980 సంచిక 7

చిత్రము : — దివ్యానందము



### చందాదారులు గమనించండి!

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెలా పంపుచున్న పత్రిక పైనున్న విలాసము గల కాగితములోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు "..../-8-"80 అనియుండిన, మీ చందా అగస్టు నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) జూలై నెల 31 వ తేది 1980 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

### —: శ్రీ వారి కార్యక్రమములు : —

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొనగోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్, ప్రశాంతినిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

సంవత్సర చందా 6 రూ ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలయును.

వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

## 19

వేదాంతము యేసాంప్రదాయమునకును యే తెగకును, యేకోవకును, యేజాతికినీ, యేలింగమునకును, యేనమ్మకమునకును చెందనిది. "సర్వేజనాస్సుఖినోభవన్తు". వేదాంతమనగా జ్ఞానము. యేజ్ఞానము? ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞానమే జన్మలాభము. తన్నుతాను తెలిసికొనుటకంటే మానవునకు అధికమగు లాభము వేరొకటి లేకపోవుటచే, శృతి స్మృతులయందు విశ్వాసము గలవారికి ఆత్మజ్ఞానము అత్యవసరము.

చూడబడునది చూచువానికంటే వేరైనదని అందరకూ తెలియును. ఈ చూచునట్టి తానెవరు? ఆకారాదులుగల శరీరమును కన్నుగానున్న ఒక యింద్రియముచే కనుగొనబడుచున్నవి. కన్ను శరీరమునే కాదు, యెదుటనున్న ప్రతి వస్తువును, వ్యక్తిని, క్రిమికీటకాదులనుకూడా కనుగొనుచున్నదికదా! ఈ కనబడునట్టి వస్తువులలో శరీరముకూడా ఒక వస్తువు కనుక ఈ శరీరము తానెట్లగును? అట్లయిన తానెవరు? అగ్నివస్తువులను కాల్చును, ప్రకాశింపజేయును అయితే కాల్చబడునట్టియు ప్రకాశింపజేయఁబడినట్టియు, వస్తువులకంటె అగ్నివేరైనట్లుచూచువారెవరు? కాల్చబడునట్టి వస్తువువేరు. కాల్చునట్టి అగ్ని వేరు, అని తెలుసుకొనువారెవరు? అదే ఆత్మ. అగ్నికట్టెనంతయూ వ్యాపించునటుల ఆత్మ శరీరమునంతయు వ్యాపించినది. అందువలననే శరీరము పనులుచేయగలదియై, కదలిక కలదియై సంచరించుచున్నది.

రాత్రియింటిలో ఇదిముల్లు, ఇదిగిన్నె, ఇది తట్ట అనితెలుపు పనిముట్టు దీపము ప్రకాశము. అటులనే కన్ను ఇది ఇల్లు, ముల్లు, పల్లు అని తెలుపునట్టి పనిముట్టుమాత్రమే. ఇది ఆత్మ కాదు.

దీపము లేక కన్ను, కన్ను లేక దీపము, ఇల్లును కానీ, ముల్లును కానీ, గిన్నెనుగానీ, తట్టనుకానీ, చూడలేవు. కన్ను అనుపనిముట్టు లేక దీపము (దీపము ప్రకాశము) అను పనిముట్టు లేక కన్ను గాంచలేదు. కాన రెండునూ ప్రకాశముయొక్క పనిముట్లె. పనిముట్లుగావున్నతనకన్నే తనదేహ మునుకూడా చూచుచున్నది. చూచేకన్నే పని ముట్టు అయినపుడు చొరబడు దేహము మాత్రము పనిముట్టుకాక మరేమగును?

లోకమున విని. తిని, చూచి, ముట్టి వాసన లను అనుభవించునవన్నియూ ఇంద్రియములే. చూచేకన్ను పనిముట్టు అయినపుడు మిగిలిన నాలుగు ఇంద్రియములుకూడా పనిముట్లే కానీ ఆత్మ కావు. ఇట్టిపనిముట్లయిన యింద్రియము లను ఆధీనమందుంచుకొనునది మనసు. ఇది ఆలోచించగల విషయము, ఇది కేవలము దీపము వంటిది. ఇదిమాత్రము యెట్లు ఆత్మ అగును? అదియునూ ఆత్మ కాదు.

మనసు అందించిన విషయమును విచారించి తేల్చునట్టిది బుద్ధి. ఇది నిశ్చయించు ఉపకర ణము మత్రమే. అనగా చిన్న వుదాహరణము: పదునైన కత్తియున్నది. అది యేంత పదునైన కత్తి అయిననూ తనకుతాను స్వయముగా ఏ పండు నూ కోయలేదు. ఎంతటి చిన్నత్రాడునైననూ కోయలేదు. అది ఒకరిచేతిలో చేరినప్పుడే ఆ పనులు చేయగలదు. అదేవిధముగ బుద్ధి కత్తివంటిది. ఇది ఆత్మచేతిలోని పనిముట్టు మాత్రమేకాని ఆత్మ కాదు.

ప్రాణము: ఇదినిద్రలో తానున్నట్లు ప్రాణ మునకు తెలియదు. నాకు శ్వాస వున్నది లేనిదీ తెలుసుకొనలేదు. జాగ్రత్, స్వప్న, నిద్రాదుల యందువున్న స్థితులను అయాసమయములందు మాత్రమే తెలుసుకొనగలదు కానీ నిద్రలో జాగ్ర తను, జాగ్రతలో స్వప్నమును గుర్తించలేదు. కనుక ప్రాణము ఆత్మ కాదు. నిద్రలో ప్రాణము జ్ఞానరహితమై పట్టుబడుచున్నది. ఇంద్రియము లు నిద్రలో పనిచేయక ఊరకుండుటచే, ప్రాణము చైతన్యము లేనటుల కానవచ్చును. దొర పని చేస్తుంటే బంట్లు ఊరక కూర్చొనుదురా ?

ఇకనేను: నేను అను పదములురెండు కలవు. 1 అహంకారము, దీనినే దేహాత్మ, ఇది బైటగల నేను. 2 అంతరాత్మ, లేక ప్రత్యగాత్మ, ఇది లోపలగల నేను. ఈ రెండింటికీ భేదము తెలియనివారు అహంకారమే. అనగా దేహాత్మనే నేను, అని అనుకొనుచున్నారు కానీ అది సత్యము కాదు. అది ఆత్మ కాదు. దేహము పనిముట్టు, అయినందున, పదార్థమెట్లు దృశ్యములో, దేహాత్మ అయిన అహంకారము కూడాదృశ్యము, ఈ అహం కారము స్వప్నమునవుండదు. నిద్రలోవుండదు. త్రికాలభాద్యం సత్యం. రెండుకాలములలో లేనిది సత్యమెట్లగును. ఈ విధముగ విచారముసలిపి, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ప్రాణము యేదీ తాను కానియెడల ఇక ఆత్మ ఏది అని, ఆత్మఎవరని, మీలో సందేహము కలుగవచ్చును.

రాకపోకలు లేని, కరచరణ అవయవములు కానీ, మాలిన్యము చేరని, అణువున అణువుగను. ఘనమున ఘనముగను. ఆకాశమువలే అంతటా నున్నను, నేను, నాది అను భావము లేక, అగ్నికి వేడిమివలె, సూర్యునకు ప్రకాశమువలె ఎరుకయే స్వభావముగాగలది ఆత్మ. శోక కోప పంచేంద్రి యాది సంబంధములేక పరమానందమైనది ఆత్మ.

సర్వజీవులయందు, హృదయముగా ప్రజ్ఞగావునదే ఆత్మ. దృశ్యములందు దృక్కుగా చూడబడేవస్తుజాలమును చూచువాడే ఆత్మ. కరణాదుల సహాయములతో చూచి, విని, తిని, చెప్పువాడెవడైననూ సరే వాడు కేవలము దీపమువంటివాడే కానీ ఆత్మస్వరూపుడు కాడు. ఆత్మ అల్పదృష్టకానీ, క్రమదృష్టకానీ, అద్రష్టకానీ, అన్యథాదృష్టకానీ కాదు. బుద్ధి చంద్రుని వంటిదయినప్పటికినీ స్వప్రకాశము కాదు దానికి సూర్యునివంటి ఆత్మకు అతి సమీపముననున్నందున అది ఆత్మతో కలియవీలున్నది. లక్కా, చెక్కా చక్కగా అంటుకొనును. బుద్ధి, ఆత్మ అట్టివి కావు, అభ్యాసముచేమాత్రము కలియును. సూర్యుడును ఇతరవస్తుసాన్నిధ్యమును బట్టే సూర్యుని జగచ్చక్షువు అని చెప్పబడుచున్నారు, సూర్యునకు నేను అని కాని, నాది అనికానీ, ఒక కోరిక కానీ లేదు. అతని సాన్నిధ్య మాత్రమున చీకటి పోయి వెలుతురు, వెలుగువచ్చి సర్వము ప్రకాశించుటవలన అతడు ప్రకాశకుడయినాడు కానీ అతనికి కర్తృత్వరూపమును ప్రకాశత్వము లేదు. అటులనే ఆత్మకు, మార్పులు, కానీ కూర్పులు కానీ లేని, ఆత్మ కర్త యెటులగునని అడిగినచో, సూదంటు రాయికి కర్తృత్వమెటులు తనదాపున చేరిన సూదిని కదల్చును?

ఆత్మవున్నదాలేదా? ఉన్నయెడల ఏ ప్రమాణముచే సాధింపబడును? ఆత్మవున్నదనుటకు ప్రమాణముతో పనిలేదు. ఆ ప్రమాణములచే సాధింపబడవలసిన యెడల, ఆప్రమాణము వుపయోగించి పరిక్షించు వాడు మరొకడుండవలెను కదా అతనెవరు? పోనీ అతనే ఆత్మ. ఆత్మకలదని చెప్పుటకు వేదమే ప్రమాణమని కొందరు చెప్పవచ్చు వేదముచేకూడా ఆత్మ సాధింపబడదని చెప్పవచ్చు. అనాత్మ ధర్మములను నిషేదించి దానబ్రహ్మమన్నారు. ఆత్మ అన్నను ఒకటే అనితెలుపుటలో వేదము ప్రమాణముకావచ్చును, కానీ స్వయంసాక్షి అయిన ఆత్మకు వేద ప్రమాణములులేవు.

శాస్త్రప్రమాణము ననుసరించి, ఉత్సాహము, సాహసము, ధైర్యము, సద్బుద్ధి, శక్తి ప్రరాక్రమము అను ఆరు సుగుణములున్న ఉండుచోట సాక్షాత్ భగవానుడయి వసించును. ఇట్టి గుణములను ప్రభోదించుటే, గణపతిపూజ అనగా ప్రారంభము. పిరికిపందలకు ఆధ్యాత్మక్షేత్రమున చోటే లేదు. దుర్జనులు, దృఢవిశ్వాసము లేనివారు, సందేహస్తులు, యేడుపుముఖము, వారు, వైద్యులకు శిష్యులుగా వుండవలసిన వారే కానీ యోగులెన్నటికీకానేరరు. జ్ఞానికి అజ్ఞానికి ఇది భేదము. "ప్రహసన్నివ" కృష్ణుడు ఆనందాతిరేకములతో నవ్వుచూ పలుకుట అర్జునుడు దుఃఖాకులుడై వినుట, జ్ఞానియెల్లపుడును నవుతాడు. అజ్ఞాని యేడుస్తూవుండును.

(సశేషము)

# కదలిందదిగో కాశ్మీరం

కరుణామూర్తి భగవాన్ శ్రీసత్యసాయిబాబావారు పలువురు శ్రీ సత్యసాయికాలేజి ఉపాధ్యాయులను వెంటనిడుకొని జూన్ 1వ తేది బృందావనము నుండి విమానంలో హైదరాబాద్ మీదుగా బయలుదేరినారు. హైదరాబాద్ విమనాశ్రయంవద్ద కొన్నివేల మంది భక్తులు, సమీపంలోనే నిర్మించిన షామీనాల పంది రిలో భజనలుచేయుచున్న వారికి దర్శనమిచ్చి, వారిని ఆనందపరచి, అదే విమానమును అధిరోహించి, సాయంత్రం 3 గం॥కు న్యూఢిల్లీ చేరిరి. వేలాది ప్రజలు విమానాశ్రయమునందు జైజై వినాదాలు చేయుచుం డగా, స్వామి వారందరికి అభయాశీర్వాదములనం దించిరి. శ్రీ మోహన్‌లాల్‌గారి భవనములో స్వామి వారు ప్రవేశించి, ఆ భవనంచుట్టూ వారి దర్శనార్థం తహతహ లాడుచున్న భక్తసమూహమునకు దర్శన భాగ్యము నొసంగిరి.

భగవంతునికి విశ్రాంతియెక్కడ? "నేను విశ్రాంతి కొఱకు రాలేదు. భక్తరక్షణ, ధర్మోద్ధరణ కొఱకు వచ్చాను" అని స్వామి శెలవిచ్చారు. కదా! 5 గం॥ నుంచి శ్రీవారి సందర్శనార్థం ఆ భవనమందు వేచి యుండిన మంత్రులు, జడ్జీలు, రాయబారులు, లోక సభాసదస్యులైన సంజయగాంధిగారు మొదలగు వారికి ఆశీర్వచనములననుగ్రహించి వారిని తృప్తిపరచిరి.

2వ తేది ఢిల్లీ మహానగరమునుండి పరిసర ప్రాం తాలనుండి వచ్చి ఆ భవనప్రాంగణమునందుచేరి, భజన చేయుచూ వేచియుండిన వేలాది ప్రజల మధ్య స్వామి నడచుచూ వారందరికీ సమీప దర్శనమొసంగి, ప్రోత్స హించి సంతుష్టిని అందించిరి.

3వ తేది, ఉదయం ఢిల్లీనుండి విమానములో బయలుదేరి, కాశ్మీరమునకు ప్రయాణముచేసిరి. మార్గ మధ్యమున, పంజాబ్, హర్యానా రెండు రాష్ట్రము లకూ ఏకైక రాజధానియగు చండీఘర్ నగరమందు విమానము కొన్నినిమిషాలు ఆగినది. ఆ పుణ్యముహూ ర్తమును సార్థకముచేయు అభిలాషతో ఆ విమానాశ్ర యంవద్ద వేలాది మంది, భజనలో నిమగ్నులై బారులు తీర్చి, క్రమశిక్షణ పాటించుకొని కూర్చొనియుండగా, వారందరికీ దర్శనమిచ్చి స్వామి వారిని ఆశీర్వదించిరి. తరువాత విమానం 9-30గం॥కు జమ్ము చేరగనే, అచ్చట భారతసైన్యాధిపతి జనరల్ మల్హోత్రగారు తమ పరివారముతో, స్వామికి సుస్వాగతము నొసం గిరి. వేలాది భక్తుల కన్నుల కరువు తీరినది; ఆనంద బాష్పాలతో వారు జైజై సాయిరాం అని వినాద ములు చేసిరి.

అచ్చటనుండి, స్వామివారు జనరల్‌గారి కారులో బయలుదేరి, 12గం॥కు ఉధంపూరు చేరిరి. ఇతర సైన్యాధికారులు, జమ్ము-కాశ్మీర రాష్ట్రపు ఉన్నతోద్యో గులు వందలాది భక్తులు తమతమ కారులలో స్వామి వారిననుసరించి ఉధంపూర్ నగరమునకు ప్రయాణము చేసిరి. సరిగ్గా మధ్యాహ్నమున స్వామివారు ఆ నగ రమునకు విచ్చేసిరి. అక్కడ, భక్తులు సాయంత్రం 6గం॥కు బ్రహ్మాండమైన సభ ఏర్పాటు చేసిరి.

పర్వత శ్రేణులలోని గ్రామవాసులు వేలాది మంది గుమిగూడి భజనలో పాల్గొనిరి. ఆ నగరమందు ఒక పెద్ద మిలిటరిక్యాంపు కూడవున్నది. కాబట్టి, అధిక సంఖ్యలో సైనికులు దర్శనముకొఱకు, స్వామి వారి దివ్యోపన్యాసమును విని తరించుటకొరకు సువిశాలమైన సభాంగణమందు మధ్యాహ్నము 3 గం॥ నుంచి కూర్చొని యుండిరి. ప్రశాంతినిలయ భజనలను, అదే క్రమశిక్షణతో అచ్చట ప్రజలు—స్త్రీలు పురుషులు నేర్చిన తాళమేళాలతో పాడి అందరినీ ఆనందింపజేసిరి. శ్రీవారి అమృతోపన్యాసమును సైనికులు ప్రజలు అందరూ శ్రద్ధా భక్తులతో గ్రోలి పునీతులైరి.

4 వ తేది శ్రీవారు జనరల్ మల్హోత్రగారితో జమ్ము-కాశ్మీరరాష్ట్రరాజధాని శ్రీనగరమును చేరిరి. పర్వత శ్రేణులమధ్య అచ్చటచ్చట కనబడిన మిలిటరి స్థావరములనన్నిటి దగ్గర శ్రీవారు కారు నిలిపి, సైనికులను ఆశీర్వదించిరి. దారి పొడుగున ప్రజలు ఇరు ప్రక్కలందు నిలువబడి, శ్రీవారి దర్శనమువలన జన్మసాఫల్యమునందుకొనిరి.

జనరల్ మల్హోత్రగారి బంగళా వద్ద షామీనాలతో చక్కని స్టేజి ఏర్పాటు చేసియుండిరి. శ్రీ నగరమందు శ్రీ సత్యసాయి సేవాసమితి కొన్నిసంవత్సరములు సేవా కార్యక్రమములను సాధనాదృష్టితో అనుసరించుచున్నది. ముస్లిం స్త్రీలు బహుమంది మహిళావిభాగ్ సదస్యులుగా బాలవికాస్ శిక్షణతరగతులు జరుపటము, దీన దలితులకు అన్న వస్త్రాలు పంచటము మొదలైన సేవా కార్యములతో పాల్గొనుచున్నారు. సేవాదళ సభ్యులు, మసీదులు హిందూదేవాలయములు వీటిని అప్పుడప్పుడు పరిశుభ్రము చేయుచున్నారు. శ్రీ వారి సన్నిధిన నగర సంకీర్తన భజనకార్యక్రమ్కక్రమశిక్షణ పరిపాలన, వీటి వివారు ఉత్సాహముతో నెర వేర్చిరి. ముస్లిం, క్రైస్తవ పార్సీ జైన సిక్ఖ్ మొదలగు అన్నిమతస్థులు సత్యసాయి సేవాసమితి మెంబర్లుగా చేరి, సేవచేయుచున్నారు.

5వ తేదినుంచి 14వ తేదివరకు శ్రీవారు శ్రీనగరము నందే బసచేసి, ఆ ప్రాంతముయొక్క ఆబాలగోపాలం ప్రజలకు నిత్యకల్యాణమునందించిరి. భగవద్దర్శనార్థము జనరల్ మల్హోత్రగారి బంగళావద్దనూ, శ్రీవారు విచ్చేసిన షాలిమార్ బాగ్, గుల్మార్గ్, పహల్గాం మొదలగు స్థానములందు, ప్రజలు వేలాది సంఖ్యలోచేరి. దర్శనభాగ్యమునందుకొనిరి. మిలిటరి క్యాంపులకు వెళ్ళి సైనికులను ఆశీర్వదించి అభయమిచ్చి వారి సేవా నిష్ఠను శ్రీవారు బలపరచిరి. వారు శ్రీవారిని అనుసరించి భజన గీతములను పాడి సంతృప్తులైరి. 8వ తేది ఆదివారం స్వామివారు సత్యసాయి సేవాసమితి సభ్యులకు మహిళామండలికి ఆధ్యాత్మిక ప్రబోధనం సందించి ప్రోత్సహించిరి.

5వ తేది (శ్రీనగరములోని విశాలమైదానమొక్కటి గలదు). అందు లక్షలాది ప్రజలు సమావేశమైరి. అచ్చటకు స్వామివారు విచ్చేసి, శ్రద్ధా భక్తులతో వారర్పించిన అంజలిని స్వీకరించి, దివ్యోపన్యాసమునన్నుగ్రహించిరి. డా॥ సూరిభగవంతం డి. యస్‌సి, గారు శ్రీవారి సందేశమును తర్జుమా చేసి ఆంగ్లభాష తెలిసినవారికుపకరించిరి.

8వ తేది జమ్ము-కాశ్మీర గవర్నర్‌గారైన శ్రీ యల్ కె. ఝాగారు శ్రీవారిని దర్శించి, వేలాది భక్తులకు దర్శనభాగ్యమును అనుగ్రహించుటకొఱకు రాజభవనమునకు స్వాగతించిరి.

ముఖ్యమంత్రి షేక్ అబ్దుల్లాగారు శ్రీవారి దర్శనార్థము కుటుంబ సమేతం 8వ తేదిన వచ్చి పుష్పమాలతో తమ ఆనందబాష్పములను స్వామికి సమ

ర్పించిరి. తరువాతకూడ, అవకాశముకల్పించుకొని రెండు పర్యాయములు దర్శన, స్పర్శన, సంభాషణ భాగ్యమునందుకొని, తన ఆతిథ్యమును స్వీకరించుటకు భక్తితో ఆహ్వానించిరి.

నిత్యమూ తమ సన్నిధికి ఆతురతతో వచ్చిన ప్రజలకు స్వామి ఆరోగ్యప్రదమైన సర్వబాధానివారకమైన విభూతిని సృష్టించి ఇచ్చిరి; వేలాది మంది భక్తులకు ప్రత్యేకదర్శనమిచ్చి వారి కోరికలను తీర్చిరి: వారి హృదయమందు శరణాగతభావమును నాటి పెంచిరి. దూరప్రాంతములనుండి ప్రవాహరూపముగా జనులు శ్రీనగరం రావటంవలన, 12వ తేది, మూడు చోట్ల వేదికలను నిర్మించిరి. ఒక స్థానమునుంచిమరొక స్థానమునకు కారులో బయలుదేరి, లక్షలాది ప్రజలకు కొన్నిగంటలలోపల ఆనందదర్శనము దొరకే అవకాశమును అధికారులు కల్పించి కృతార్థులైరి.

ఒకనాడు శ్రీ వారు శ్రీనగరమునకు 15 మైళ్ల దూరములోనున్న దాచిగాం అనే గ్రామమును చేరి అచ్చట పర్వతశ్రేణుల సుమనోహర దృశ్యములను భక్తులకు చూపిరి, తరువాత దగ్గరనే పారుచున్న నది ఒడ్డున ఆసీనులై, ఇసుకనుంచి అమరనాథుని స్ఫటిక లింగమును బదరీనాథుని లక్ష్మీ నారాయణ స్వరూప



షేక్ అబ్దుల్లాదంపతులు - శ్రీవారు

మును ప్రత్యక్షీకరించి భక్తులకు వాటిపవిత్రతను వర్ణించిరి. మరొకనాడు, పాహల్గాం గ్రామమందు భక్త సమూహమునానందపరచుకొరకు దేదీప్యమానంగాప్రకాశించుచున్న శ్రీచక్రమొకటిని సృష్టించి ధ్యానపూజాదులతో ఆరాధించమని ఆదేశించి ఒకరిననుగ్రహించిరి. అట్లనే, కేదారనాథం చిదంబరం లింగములనూ ప్రత్యక్షీకరించి, వాటిని శంకరాచార్యుల వారు తపో బలముచే సంపాదించి ప్రతిష్ఠించిన దివ్యోదంతమును వివరించిరి. "మీకేమికావాలి?" అని భక్తులను ప్రేమతో ప్రశ్నించి వారడిగిన పవిత్ర వస్తువులన్నిటినీ తమహస్తమందు అప్పటికప్పుడే సృష్టించి అందించిరి. భగవానుడు భక్త పరాధీనుడు, కదా?

14వ తేది శ్రీవారు శ్రీనగరమునుంచి వెడలుచున్నారు అనే వార్త కాశ్మీరమంతా వ్యాపించినది, ముఖ్య మంత్రి షేక్ అబ్దుల్లాగారు వారి బంధు మిత్రులు, జనరల్ మల్హోత్రా దంపతులు, సైన్యాధికారులు, వేలాది మంది పురుషులు స్త్రీలు దీనవదనాలతో, కంటిధారలతో, వీడ్కోలు తెల్పుచుంటే, ఆ దృశ్యము చూచినచో కఠిన హృదయములుకూడా తరగి కంటి తడి పెట్టక మానరు, విమానాశ్రయం వద్ద, గట్టిబందోబస్తుగా తుపాకి ధరించి నిలిచియున్న సిపాయిలనుకూడ ధిక్కరించిన పురుషుల స్త్రీల హృదయావేదన వివరించుట కలవికానిది.

15,16 తేదీలు శ్రీవారు ఢిల్లీ నగరమందే వుండిరి, భక్తులకు ఆరెండు రోజులూ పెద్ద పండుగ. ఉదయం సాయంత్రం వారు దిననిత్య కార్యక్రమములను మానుకొని, సోహన్‌లాల్‌గారి బంగళా ముందుచేరి, భజనలో పాల్గొని దర్శన భాగ్యమునందుకొనిరి. సంవత్సరాల కొద్ది స్వామి రాకకై తహ తహ లాడుచుండిన భక్తులు కొందరి ఇళ్లకు స్వామి విజయంచేసి వారిని ఆశీర్వదించిరి. వందలాది మంది భక్తులతో సంభాషించి వారి కోరికలను తీర్చిరి.

17వ తేది స్వామివారు బొంబాయి నగరమునకు ప్రయాణముచేసినపుడు, ఢిల్లీ భక్తులు వేలాదిమంది, "స్వామి ! ఇంకా కొన్నిరోజులు ఇచ్చటనే వుండక ఇంత త్వరగా బయలుదేర వచ్చునా ? అతి శీఘ్రముగా మరి విజయము చేయండి" అని కంటిదారలతో ముకుళిత హస్తాలతో ప్రార్థించిరి.

ఈ సంవత్సరం శ్రీవారి జన్మదినోత్సవ సందర్భమున, ప్రశాంతినిలయమందు జరిగే మూడవ ప్రపంచ మహాసమ్మేళనంగురించి కార్యకర్తలు బొంబాయి నగరమందు శ్రీవారితో సంప్రతించిరి. 18వ తేది, ధర్మక్షేత్ర ప్రాంగణమునందు నిర్మించుటకు సంకల్పించియున్న సభామంటపమునకు శ్రీవారు శంకుస్థాపన జేసిరి. విమానమార్గముగా బెంగుళూరు బృందావనమును భక్త పరివారముతో చేర్కొనిరి.

ఉత్తరభారతమున లక్షలాది ప్రజలకు ప్రత్యక్షపరమాత్మని దర్శించే పుణ్యవిశేషము లభించినది. సత్య, ధర్మ, శాంతి, ప్రేమలతో నిత్య జీవనయాత్ర సాగించు, అనే భగవత్సందేశము అన్ని హృదయములలోనూ ప్రతిధ్వనించినది.

**ఆధారము: స్వామికారుణ్యానందగారి లేఖ**

# నిస్వార్థ సేవ

నేటి బాలురే రేపటి పౌరులు. ఈ సత్యాన్ని గుర్తించి పవిత్రహృదయులైన చిన్నపిల్లలను విద్యావంతులుగ చేసినప్పుడే దేశము అభివృద్ధి చెందగలదు. భవనమునకు పునాది ఏవిధముగా ఆధారమో, అదే విధముగ మన దేశ సౌభాగ్యము బాలల ఉన్నతిపై ఆధారపడి ఉన్నది. ఈ విషయమును గుర్తించుటచే అనంతపురంలోని శ్రీ సత్యసాయి మహిళాకళాశాల విద్యార్థినులు 'బాలవాడి'ని నెలకొల్పిరి. సమాజములోని నిరుపేద వర్గానికి చెందిన బాలబాలికలకు విద్యాసౌకర్యము కలిగించుటయే దీని ఉద్దేశ్యము. ఈ బాలవాడి 1976లో ప్రారంభించబడినది.

బాలవాడిలోని బాలబాలికల సంఖ్య ముప్పది. ప్రతి దినము ఉదయము 7 గం॥ల నుండి 9-50 వరకు వీరికి విద్యను బోధింతురు. పదిమంది విద్యార్థినులు ఈ కార్యక్రమములో పాల్గొనుచున్నారు. ఒక్కొక్క రోజు అయిదుమంది పనిచేయుదురు. అందులో ఇద్దరు, పిల్లలకు కావలసిన ఆహారమును తయారు చేయుదురు. ముగ్గురు విద్యనేర్పుదురు. ప్రతిరోజు ఉదయము కొంత ఉపాహారమును పిల్లలకు ఇచ్చెదరు.

కేవలము విద్యాబోధనే కాక శారీరకోల్లాసమునకై ఆటపాటలు కూడ నేర్పుదురు. వీరిని ఉత్సాహపరచుటకై ఆటలలో పోటీలనేర్పరచిరి. అందులో నెగ్గిన వారికి 7-7-77 న భగవాన్ బాబాగారు తమ దివ్యహస్తములతో బహుమతులను పంచిరి. ఇతర పాఠశాలలలో వలె వీరికికూడ యూనిఫారం ఉన్నది. ఈయూనిఫారంను స్వామి స్వయముగ పిల్లలకు ఇచ్చిరి.

బాలవాడిలోని బాలబాలికలు మూడుతరగతులకు చెందినారు. మొదటి తరగతిలో 18మంది పిల్లలు, ఒకటవ తరగతిలో 8 మంది పిల్లలు, రెండవ తరగతిలో 4 మంది పిల్లలు కలరు. వీరికి కావలసిన పలకలు, బలపములు, పుస్తకములు కళాశాల ప్రిన్స్‌పల్ గారు పంచిపెట్టారు. ఈ కార్యక్రమమువలన కళాశాల చుట్టుప్రక్కల ఉన్న పిల్లలు లాభము పొందుతున్నారు. కళాశాల విద్యార్థినులు తమదైనందిన కార్యక్రమములలో పాల్గొనుచు, మిగిలిన కాలములో కొంత భాగమును ఈ విధముగ సద్వినియోగము చేసుకొనుచున్నారు. ఈ కార్యక్రమము స్వామి ఆశీర్వచనముల వలన ముమ్ముందు ఇంకను పురోభివృద్ధి కాంచగలదు.

డాక్టర్. హేమలతా, పి. హెచ్‌డి.

# “మాయలో ప నాను”

కొద్ది రోజులక్రింద నేను భారతదేశంలో ఉన్నాను. అక్కడ నాకు ఒక అత్యంత విషాదకరమైన అనుభవం కలిగింది. అట్టి విచిత్రమైన సంఘటనలు మనము ఊహించిన వాటికన్నా ఎక్కువగా సంభవిస్తుంటాయి. ఒక పరదేశ స్త్రీ ఉండేది; ఆమె సాయిబాబాను గురించి అనేక విషయాలు వినింది. ఆమెకు అనేక వ్యక్తిగత సమస్యలు ఉండేవి. భారతదేశానికి వెళ్లి బాబా వారి ఆశీర్వాదాలు, సహాయము పొందదలచింది. కానీ ఆమె తాను నాస్తికురాలనని చెప్పుకొనేది. తన మిత్రులూ పరిచితులూ బాబాను గురించి చాలా అద్భుతవిషయాలు చెప్పడం వలన తాను కూడా భారతదేశానికి వెళ్లి బాబాను దర్శించదలచింది. దర్శనసమయంలో స్వామి ఆమెవైపు చూడలేదు. ఆమెను పూర్తిగా చూడనట్లు కనిపించినారు. ఈ బాధాకరమైన అనుభవం వలన ఆమెకు నిరాశ నిస్పృహ కలిగినాయి

అప్పుడు నా మిత్రులలో ఒకడు ఆమెను పలుకరించినాడు. భగవానుని తత్వాన్ని ఆమెకు విశదీకరించడానికి ప్రయత్నించినాడు. బాబా ఎప్పుడూ ఆధ్యాత్మికశ్రేణిలో బోధిస్తారని చెప్పినాడు. ఆమె సందేహాలకు తగిన సమాధానాలను ఇవ్వడానికి చాలా కాలాన్ని వినియోగించినాడు. కానీ లాభం లేకపోయింది. 'బాబా నాతో ప్రత్యేకంగా ప్రసంగిస్తారు, నన్ను మందహాసవదనంతో పలుకరిస్తారు, నన్ను వ్యక్తిగతంగా పరామర్శిస్తారు, నా సమస్యలను తమ అనిర్వచనీయమైన ఆధ్యాత్మికశక్తితో పరిష్కరిసారు' అని ఆమె అనుకొంటుండేది. ఇతరుల అనుభవానికీ తన స్వానుభవానికీ చాలా వ్యత్యాసం కనిపించింది. స్వామి ప్రతి వ్యక్తినీ స్వయంగా పలుకరించి వారి వారి వేలాది కష్టాలను తీరుస్తారని ఆమె భావించింది. కానీ ఆమెకు అలాంటి అదృష్టం కలుగ లేదు. స్వామి ఆమెను పలుకరించక పోవడమే కాకుండ ఆమెవైపుకూడా చూడలేదు ఆమె నిరాశచెంది చాలా బాధ పడింది.

ఒక రోజు మధ్యాహ్నం భోజనసమయంలో నేను ఆమె ప్రక్కన కూర్చొన్నాను. అప్పుడు తన హృదయంలోని అశాంతి, మనసులోని బాధను నాతో వెళ్లబోసుకొంది. నేనుకూడా నాశక్తి కొద్దీ ఆమెను ఓదార్చడానికి ప్రయత్నించినాను. నేను ఏమి చెప్పినా ఆమె వినలేదు. ఆమెకు స్వామిమీద కలిగిన దురభిప్రాయాన్ని తొలగించలేక పోయినాను. తరువాత నేను ఆమెను మళ్లీ చూడలేదు. బహుశః ఆమె స్వదేశానికి వెళ్లిపోయి ఉంటుంది.

ఇంతకంటే విచిత్రమయిన సంఘటన ఒకటి జరిగింది. నేను కూడా ఇదే మాయలో పడినాను. సుమారు ఐదు సంవత్సరాల క్రితం ఈ సంఘటన జరిగింది. స్వామివారు తమ అపారమైన ప్రేమకిరణాలను నామీద ప్రసరించినారు. నాలుగు నెలలు నేను వారి సమక్షంలో అద్వితీయమైన ఆనందాన్ని అనుభవించినాను. నన్ను ఒక పసిపాపవలె లాలించినారు. ఇలాంటి అవ్యాజానురాగంవలన నేను కొంతవరకూ చెడిపోయినాను నాలో అహంభావం పెరిగింది. కానీ ఒక విషయాన్ని నేను గ్రహించగలిగినాను. హృదయానికీ మనసుకూ

అతీతమైన అంతస్తులో స్వామి నాకు అనేక విషయా లను బోధించినారు. ఆధ్యాత్మికసందేశాలను ఎఱుక పరచినారు. నాకు తెలియకుండానే నేను వారి ప్రబో ధములను అనుసరించినాను. స్వామి అవ్యాజాను రాగానికి మహత్తరమైన కారణాలు ఉన్నాయి.

కానీ ఈ సారి పరిస్థితులన్నీ తారుమారైనాయి. హృదయంలో కల్లోలం, మనసులో ఆందోళన ఆవి ర్భవించినాయి. రెండు మూడు సార్లు చిరునవ్వు నవ్వినారు. అంతే, మళ్లీ నావైపు చూడలేదు. స్వామికీ నాకూ మధ్య ఉన్న పూర్వపరిచయం పూర్తిగా మాయ మైనట్లనిపించింది. ఎలాంటి వ్యక్తిగతమైన ఆదరాభి మానాలనూ స్వామి చూపించలేదు. నన్ను సంపూ ర్ణంగా నిర్లక్ష్యం చేసినారు. ఇలా కొన్ని రోజులు గడచినాయి. నేను వర్ణించడానికి వీలులేని బాధ, అశాంతిని అనుభవించినాను. స్వామి నన్ను పలుక రించకపోతే ప్రపంచమే అంతమైపోతుందనిపించింది. కానీ స్వామి నావైపు చూడనూలేదు, పలుకరించనూ లేదు. నా హృదయం విలపించింది, మనసు ఆవే దన చెందింది. నాగదిలో హృదయవిదారకమైన ఒంటరితనాన్ని అనుభవించినాను. "స్వామీ నేను తమతో మాట్లాడడానికి తహతహలాడుతున్నాను", అని బిగ్గరగా అరచి ఏకాంతంగా విలపించినాను.

ఇది సర్వసామాన్యమైన అనుభవమనుకొంటాను. నా దారుణమైన అనుభవాన్ని ఇతరులకు వ్యక్తపరచి నాను. వారుకూడా నాలాగే బాధపడినవారు. ఇది ఒక రకమైన ఆధ్యాత్మికవిరహం, భగవానునితో ఎడ బాటు. ఈ భగవద్విరహాన్ని అనుభవించిన వారిలో కొందరు అదృష్టవంతులు ఉండ వచ్చును. ఇలాంటి బాధాకరమైన అనుభూతిద్వారా వారు తమ హృదయా లకూ, మనసులకూ అతీతమైన జీవాత్మ సాక్షాత్కా రాన్ని పొందుతారు. నీ అంతరాత్మ భగవాన్ శ్రీ సత్యసాయిబాబాతో ఏకత్వం లేక తదాత్మ్యం పొంద డమే ఆధ్యాత్మికసాధనయొక్క పరమార్థము. నీ ఇష్టదైవంయొక్క రూపనామాలతో అద్వైతానుభూతిని పొందుట సాధకుని లక్ష్యం. ఇలాంటి అలౌకిక అను భవాన్ని పొందకపోయినా ఫరవాలేదు. ఇలాంటి సాధనవలన మన అంతరాత్మలో పరమాత్ముని దర్శించగలం.

మొదటి పర్యాయం స్వామిని దర్శించినప్పుడు నేను దినచర్య వ్రాసుకోలేదు. రెండవ పర్యాయం భారతదేశానికి వెళ్లినప్పుడు ప్రతి దినం సక్రమంగా నా ఆధ్యాత్మికానుభవాలను ఒక పుస్తకములో వ్రాసుకొ న్నాను. ప్రతిరోజూ జరిగిన సంఘటనలను విపులంగా వ్రాసినాను. నా దినచర్య పుస్తకాన్ని మళ్లీ పునశ్చరణ చేసినప్పుడు నాకు అమితమైన ఆశ్చర్యం ఆనందం కలిగినాయి. స్వామి నిజంగా నన్ను విస్మరించలేదు. స్వామి నన్ను మరచిపోయినారనుకోవడం నా పొర పాటు. అసలు కారణమేమిటంటే నా ఆధ్యాత్మిక పిపాస అధికం కావడం వలన నేను అట్టి అనంతృ ప్తిని పొందినాను. స్వామి పరమానందాన్ని ప్రసా దించినా జీవాత్మకు ఎప్పుడూ అనంతృప్తియే. భగ వానుని అవ్యాజానురాగాన్ని ఎంత అనుభవించినా ఇంకా అనుభవించవలయుననిపిస్తుంది. సాధకుడు అనిర్వచనీయమైన సచ్చిదానందాన్ని పొందేవరకూ ఇలాంటి బాధతప్పదనుకొంటాను.

జనవరి 15వ తేదీనుండీ 22వ తేదీ వరకు ప్రతిని త్యమూ రెండు మూడు సార్లు స్వామివారు దర్శనమిచ్చే వారు. ఆవారం రోజుల్లో స్వామి అనేక రీతులలో నన్ను ఆనందపరవశురాలను చేసినారు. వారి దివ్య మందహాసంతో నన్ను పులకరింప చేసినారు. వారి కరస్పర్శతో తన్మయత్వాన్ని పొందినాను. ఇంతే కాదు. నాలుగు సార్లు నాతో సంభాషించినారు. జన

వరి 21వ తేదీ లిఖింపబడిన సుభాషితం ఇది: "భక్తి అంటే సంపూర్ణశరణాగతి. దీనిని సర్వకాల సర్వావస్థలయందు ఆచరింపవలయును. ఇది ఆచరించి విడిచిపెట్టు కార్యక్రమం కాదు. ఇది సాధనవలన లభించునదేకానీ ఎరువు తెచ్చుకుంటే వచ్చేది కాదు. సాధించి పదిలపరచవలయును. మనము సాధించిన దానికన్న ఎక్కువ ఆశించలేము. క్రమశిక్షణ, శీలము వలన భగవంతుని కృపకు పాత్రులము కాగలము."

స్వామివారి అపారమైన ప్రేమ అనుభవైకవేద్యం. కానీ ఇలాంటి అనుభూతిలోకూడా సాధకుడు మాయలో పడవచ్చును. ఈ మాయకు కారణం తనివితీరని ఆధ్యాత్మికపిపాస. స్వామిచే తిరస్కరించబడినాననే తాత్కాలిక భ్రమ. ఈ అసంతృప్తిని నిరంతర సాధనచే అధిగమించవచ్చును. ప్రార్థన, సాధన, ప్రేమ వలన సచ్చిదానందాన్ని పొందవచ్చును.

అప్పటినుంచీ సేవాతత్పరురాలనైనాను మానవ సేవలోని మాధుర్యాన్ని చవిచూచినాను. ఎవరికి సేవ అవసరమో వారికి సేవ చేసినాను. ఇతరులకు సేవ చేయడం వలన స్వార్థపరత్వం, అహంభావం నశిస్తాయి. మన భగవానునికి సంతోషం కలుగుతుంది. నా సేవను బాబావారికి అర్పించడం వలన తలవని తలంపుగా అనేక రకాలుగా లాభాన్ని పొందినాను. ఈ రెండవ యాత్రలో ఎన్నో విచిత్రమైన అనుభూతులు కలిగినాయి. అవన్నీ నా అంతరాత్మకు సంబంధించినవి. అదంతా ఒక చక్కని కథగా వ్రాయవచ్చును. సాయి బాబాను దర్శించడానికి వెళ్లే వారందరు దినచర్య వ్రాసుకోవడం చాలా అవసరం. మీభావాలు, మీస్వానుభవాలు, ఇతర సాధకుల అనుభవాలు ఒక దినచర్యపుస్తకంలో వ్రాయడంవలన ఆధ్యాత్మికపురోభివృద్ధి లభిస్తుంది. స్వామి సమక్షంలో లేనప్పుడుకూడా స్వామి సాధకులకు మార్గాన్ని చూపిస్తారు. అన్నిటికన్నా ఒక ముఖ్యమైన విషయముంది. ప్రతి మానవుని అంతరాత్మలోనూ గురువున్నాడు. మనము ఆ గురువుని గుర్తించలేనప్పుడు స్వామియే మన సద్గురువు. ఈనాటి జగద్గురువు.

ప్రేమతో ఒక సాధకురాలు
(అనువాదకుడు: బి. శ్రీనివాసమూర్తి)

# సత్యము

సర్వత్ర దైవము తప్ప అన్యము లేదు. దైవమొక్కటి మాత్రమే సత్యము. కనుక, ప్రతి పదార్థమునందు ఆధారరూపుడై దివ్యప్రకాశమునందిస్తూ బుద్ధిగ్రాహ్యముగా వెలసే ఆత్మతత్త్వము అందరియందూ ఉన్నదనే సత్యాన్ని గుర్తించాలి. కానీ, ఈనాడు మానవుడు సత్యము, సత్యము, అని వేదికలపై మాత్రము ఉచ్చరిస్తున్నాడే కానీ, సత్యముయొక్క స్వరూపాన్ని గుర్తించుటకు ప్రయత్నించడం లేదు.

తనయందున్న సత్యాన్నికూడ తాను గుర్తించడానికి భయపడుతున్నాడు మానవుడు; కనుకనే తన ప్రవర్తన కూడా భిన్నమార్గమునవలంబిస్తున్నది.

సత్యమనగా ఏమిటి? చూచినది చూచినట్లు, విన్నది విన్నట్లు, చెప్పినది చెప్పినట్లు చెప్పడము సత్యమా? కాదు, కాదు;—సమాజమును ఉద్ధరించే నిమిత్తమై ఆదర్శజీవితమును అందించడమే సత్యముయొక్క స్వభావము. మానవత్వమును ఉద్దీపింపచేసే ప్రకాశమే సత్యము.

మానవుడు మానవుడుగా జీవించుటకు తగిన కృషి సల్పడమే అతని సత్యజీవితము. కేవలము తెల్లవారినది మొదలు రాత్రి పరుండువరకు స్వార్థనిమిత్తమై ఆచరించే దుష్కర్మలామనుష్యుల నిజతత్త్వము? సమాజము యొక్క సత్యాన్ని తన సత్కర్మలద్వారా నిరూపించాలి. తనయందు ప్రతిబింబించిన ఆత్మతత్త్వాన్ని సమాజముయొక్క ప్రతిబింబముగా నిరూపించాలి, ఇదియే సత్య జీవితముయొక్క లక్షణము,

మనసునందున్న భావము, మాటయందున్న పలుకు, క్రియయందున్న ఆచరణ—మూడింటికీ సన్నిహిత సంబంధం కావాలి; మూడింటినీ ఏకత్వం చేయాలి. తలంచుట ఒక్కటి, పలకడం మరొకటి, ఆచరించడం ఇంకొకటి, "మనస్యన్యత్, వచస్యన్యత్, కర్మణ్యన్యత్ దురాత్మనాం" కనుక మానవత్వమందు దివ్యత్వము ప్రకటము కావాలంటే, "మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం మహాత్మనాం" అనే సూక్తిని అనుసరించాలి.

ఈ నాడు లోకములో కృత్రిమమును ఆశిస్తూ సత్యమును విస్మరిస్తూ వస్తున్నాడు, మానవుడు. సత్యనిత్యమైన విషయములందు మానవుడు విరోధాన్ని విజృంభిస్తున్నాడు. దైవత్వము సర్వులయందున్న ఏకశక్తి, "ఈశావాస్య మిదం సర్వం," అని, గుర్తించినప్పుడే సత్యప్రాప్తి. ప్రతి జీవియందు, మానవునియందు, ప్రతి అణువునందు కూడనూ, దైవత్వము స్వరూపము ధరించి యుండును. ఒక మఱ్ఱి విత్తనమును కోసి, దానిని అనేక ప్రత్యేకమైన అద్దములతో పరీక్షించినప్పటికినీ, ఆ విత్తనములో నున్న మహాశక్తి మనకు గోచరించదు. అయితే, దానిని పోషించినప్పుడు బ్రహ్మాండమైన వృక్షముగా రూపొందుతున్నది. పవిత్రమైన భారతదేశమందు ఏ ఒక్క ప్రదేశము కూడనూ, ఏయొక అణువు కూడనూ సార్థకమైనదే, దివ్యమైనదే, అని గుర్తించాలి. ఇదియే ఆస్తికుని లక్షణము. నేను ఆస్తికుడు కాదు, నాస్తికుడు, అని చెప్పువాడు కూడ, లోలోపల ఆస్తికుడే; 'అస్తి' ఉన్నది, అనే భావములేకుండ, వాడు నాస్తికుడు కాలేడు.

ఇంక నా సత్యము ఏమి? సత్యసాయియొక్క సత్యత్వమును నిరూపించుటకు ఎవ్వరికీ సాధ్యం కాదు. సత్యసాయి సంకల్పము—"యోగక్షేమం: లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు"; సర్వులూ ఆనందంగా ఉండాలి; సర్వులూ సౌఖ్యమనుభవించాలి; అందరూ తమ కర్తవ్యాన్ని నిర్వర్తించాలి; అని లోకానందమును ఆశించడము, సాధించడము, తప్ప స్వార్థానందమునకేమాత్రమూ ప్రాకులాడుటలేదనే సత్యమును ప్రతి ఒక్కడూ గుర్తించాలి. దివ్యత్వమును గుర్తించేది అంత సులభంకాదు. కానీ కాల కర్మల కారణ కర్తవ్యాలు కలసివచ్చినప్పుడు ఈ సత్యము కూడనూ అతి త్వరలోనే మీకు అవగాహన మగును.

— శ్రీవారి దివ్యబోధ. 8-12-79.

# సాయి విద

సాయివిద్యావిధానం అనగానేమి? ఇది అందరిని కలవరబెట్టు ప్రశ్న; ముఖ్యముగా బెంగళూరు భగవాన్ శ్రీ సత్యసాయి అధ్యయన సంస్థ (study circle) లోని అభ్యర్థులను కలవర బెట్టుచున్నది. అనేక విద్యావ్యవస్థలలో ఆచరింపబడుచున్న అధ్యయన విధానములకన్న సాయి అధ్యయన విధానము వేరైనదని అందరెరిగిన విషయమే. సాయి అధ్యయన విధానమునందు ఆధ్యాత్మికత తదితర విద్యావిధానమునందు కన్ననూ మిళితమై స్పష్టముగా గోచరించునని అందరకూ తెలిసిన విషయమే. సాయి అధ్యయన విధానము సులభముగా గ్రహింపతగినదిగాదని ప్రతియొక్కరు గ్రహింపగలరు. అయినను దానిని గ్రహించుటకు అన్వేషణ కొనసాగుచునే యున్నది. అధ్యయనసంస్థాసభ్యులు దీనిని ఆచరణలో పెట్ట గోరుచున్నారు, ఎందుకనగా వారందరు ఉపాధ్యాయులు.

ఈ కౌతుకాన్వేషణలకు బృందావనములోని శ్రీ భగవాన్ సత్యసాయి కళాశాలను జాగ్రత్తగా పరిశీలించి వచో మరియును విశేషించి దానికి అనుబంధంగానున్న విద్యార్థి వసతిగృహము ఎందులోనైతే కనీసము 450 విద్యార్థులు బసచేయుచున్నారో దానిని తిలకించిన వారు ఇక్కడ ఔత్సుక్యము, సత్యనిష్టులు, విద్యార్జనలో దీక్షగలవారును నిస్వార్థ సంఘసేవాపరాయణులును, ప్రేమతో తీర్చిదిద్దబడిన విద్యార్థులు గలరని తెలుసుకొందురు.

ఈ ఘనకార్యనిర్మాత సాయి, గనుక ఇటువంటి విద్యను విద్యార్థులు ఆర్జించుటచే ఇది'' సాయి విద్యావిధానం అయినది. గ్రహించుటకు అతీతమైన భగవాన్ సాయివారి దివ్య ప్రేమను విద్యార్థులు గ్రహించుటయే ముఖ్యోద్దేశమై యున్నది. ఇది ప్రత్యామ్నాయరహితము. ఇట్టి కళాశాలను, విద్యార్థివసతి గృహములను సృష్టించాలంటే భగవాన్ సాయి తామే సృష్టించగలరు. మనబోటి సామాన్య ఉపాధ్యాయులు ఎవరైనను వీటిని అనుకరించి తోచినట్లు స్థాపించవచ్చును, కానీ, ఈ బృందావనములోని భగవాన్ శ్రీ సత్యసాయి విద్యార్థివసతి గృహమునందు ఆచరణలో గోచరమైన విషయములు నిస్సందేహముగా అనుకరింప సాధ్యము గానివి.

శ్రీ స్వామివారి తరచు విద్యార్థి వసతిగృహదర్శనము, వారిద్దైనందిన మార్గదర్శకత్వము, అనుదిన సాయంసమయ ప్రార్థనలు, శ్రీ వారి వాత్సల్యము, పవిత్రములైన రంజింపజేయు దివ్యోపదేశములు, ప్రత్యేకంగా విద్యార్థులపై శ్రద్ధ మరియు అన్యములైన గ్రహింపనలవిగాని సత్ఫలితములు లభ్యమగుట మరేయితరవిద్యాసంస్థలలో గానరావు. ఆ సర్వాంతర్యామియు మరియు సర్వజ్ఞుడైన భగవంతునికే ఇట్టివిద్యాబోధన కలుగజేయుట సాధ్యమగును.

మరెచ్చటనైననూ దీనిని ఆచరణలో పెట్టగలిగిన, ఈ విద్యావిధానమును అనుసరించు ప్రయత్నమెందులకు?

ఈ మహావ్యవస్థలో ఆచరణలోనున్న విద్యావిధానమును సునిశితముగా పరిశీలించినచో దీనిని మూడు

వర్గములుగా విభజించవచ్చునని స్పష్టమగును.

ఇవి: 1. విజ్ఞానము

2. ప్రజ్ఞానము

3. సంఘసేవ.

లోకాచారముగా సాగుతున్న కళాశాలా విద్యార్జనలో, భౌతికరసాయనికశాస్త్రములు, కళలు మరియు వాణిజ్యశాస్త్రాలు ఇత్యాదులు విద్యాబోధనకు అంకితమైన ఒజ్జలచే బోధించబడును. కాని ప్రజ్ఞానమని పిలువబడే విద్యలో భాగమైన ఆధ్యాత్మిక విషయములు స్వయంసాధనోపాసనలచే బోధితమగును. ఇయ్యది ప్రాతః ప్రార్థనలు (ఓంకారము, సుప్రభాతము, మరియు నగరసంకీర్తనములు) భోజనకాల ప్రార్థనలు, సాయంసమయ ప్రార్థనలు (భజనలు), తత్సమయాలలో సత్సంగసమావేశములు మొదలగువానిద్వారా నొసగుబడుచున్నవి. భగవాన్ శ్రీ సాయివారి దివ్యోపన్యాసములు మరియు వేసవికాలపు ఆధ్యాత్మికసాంస్కృతిక శిక్షణాతరగతులు ప్రజ్ఞానముపై ఎక్కువ ప్రభావమును జూపుచున్నవి. వాస్తవముగానివి విద్యార్థులలో అభిలషణీయమైన పరిణామమును కలిగించును. విద్యార్థికి విధేయత, కష్టించి పనిచేయుట, భూతదయ, తోటిమానవులను ప్రేమించుట మున్నగు వర్ణనాతీతములైన సుగుణములు దీనివలన అలవడుచున్నవి. విజ్ఞానముద్వారా సంఘసేవాప్రజ్ఞను పొందుట, చేతను తోటిమానవులయెడ సత్ప్రేమను పెంపొందించుకొనుట చేతను, వేదాధ్యయనమువల్లను పవిత్రహృదయముతో విద్యార్థి సంఘసేవాసక్తుడగును. ఇచ్చోట విద్యలోని సంఘసేవావిభాగము తోడ్పడును. ఇది ఆత్మజ్ఞతకు పరిశోధనాస్థానము లేదా ప్రయోగశాలగా నుపకరించును. విద్యార్థి నిస్వార్థసేవా నిరతుడగుటంజేసి సేవయను పేర ప్రేమస్వరూపుడైన భగవంతునికి అర్పితుడౌతాడు. వర్ణనాతీతమైన అనుభూతిని ఆనందించును. సర్వదా ఆనందించగోరును. బహుశః ఇదే "ఆనందానుభూతి" ఈ ఆనందానుభూతి అంకురించినవెంటనే, ఒక విధముగా (తిరుగులేకుండా) ఆకర్షింపబడును. ఇంకను అధికానుభూతిని పొందగోరి, ఇతోధికముగా సాంఘిక కార్యాచరణలలో పాల్గొనును. ఉత్తమ సాంఘికసేవ చేయుటకుగాను తన కౌశలమును పెంపొందించుకొనవలసియుండును, మరియువిట్లే పఠనక్రియలోను ప్రగతిని పొందును. ఇట్టీచక్రవలయము పునరావృత్తమగును, విద్యార్థిలక్షణము ఆకాశమునందు కొనును.

ఆధ్యాత్మికతను ముఖ్యవిషయమని మనము గ్రహింపవలయును. ఇతరవిద్యాలయాలలో దీనిని బోధనా విషయముగా చేర్చుట అతికష్టసాధ్యమగును. ఎందుకనగా ఆధ్యాత్మికత్వమంటే ఏమిటో మనము సరిగా అవగాహన చేసుకొనలేదు; మరియు ఉపాధ్యాయులకు స్వానుభవము లేదు. కనుక ఈ సందర్భములో అతిలఘు కార్యక్రమము నాలోచింపగలము. స్వల్పమే అయిననూ ఇది గమనార్హమైనది, ఎందుకనగా పునరుద్ధరణీయమైనది.

స్థిరమైన భవనములు, సామర్థ్యము, యోగ్యతగల ఉపాధ్యాయులున్న ఈనాటి విద్యాశాలలవైపు మనదృష్టి నొకింతమరల్చెదము. సాంకేతికమైన (లోకరూఢియైన) విషయములపట్ల విద్యాబోధనా నాణ్యతను పెంపొందించునవసరమును ఆలోచించుట కష్టతరము. అవసరమున్నచోట, అధ్యాపకులకు, అధికారులకు ఇయ్యది తెలిపిన సంగతే. వారు భువినిదివిగామార్చగలరన్న విషయము వాస్తవమే. ఇట్లు విద్యయొక్క మొదటి భాగము అనగా సాంకేతిక విద్యకు సంబంధించినంతవరకు, నేటి విద్యావ్యవస్థలు చక్కగా వ్యవహరిస్తున్నవని నిర్ధరింప వచ్చును.

రెండవభాగమైన ఆధ్యాత్మికతను విద్యలో బోధనా విషయముగా చేర్చాలి. కాని ఇక్కడున్న ఇబ్బంది ఏమనగా, విద్యావ్యవస్థాపకులకు ఆధ్యాత్మికవిద్యలో నమ్మకము ఉండకపోవచ్చును. లేదా సామర్థ్యముగల ఉపాధ్యాయులు లభించకపోవచ్చును. విద్యార్థులు మరియు వారి తల్లిదండ్రులు ప్రతికూలముగా వ్యవహరింపవచ్చును. భగవాన్ సత్యసాయి అధ్యయనసంస్థలలోని ఉపాధ్యాయవర్గములు, ఆధ్యాత్మికత మరియు భారతీయసంస్కృతులను బోధించుటకై స్వల్పకాలిక వేసవితరగతులను వేర్వేరు కళాశాలలనుండి వచ్చు విద్యార్థులకు ఉపయుక్తముగా నుండునట్లు నిర్వహించవచ్చును. ఈ ప్రయత్నములద్వారా, విద్యార్థుల స్వభావములో అభివృద్ధిని జూపించిన ఇది కను విప్పుగా నుండును, మరియు ఇతరులకు మార్గమును ఏర్పరచినట్లగును.

విద్యార్థులకు నిస్వార్థసేవలో నిమగ్నులగుటకు సందర్భములు కలిగించి పైవిషయములను పూర్తి జేయుటకు మరియు తమ్ముతాము పరిశీలించుకొనుటకు ఒక ప్రయోగశాల అవసరము. ఇట్లు విద్య పట్ల అనురక్తి పెంపొందించవలయును. ఇట్టిదానినేర్పరచు వ్యవస్థయే భగవాన్ శ్రీ సత్యసాయి సేవాదళము. ఈ యువతరపు సత్యసాయి సేవావ్యవస్థ నిస్వార్థసేవకై అర్పితమయినది. విద్యార్థులు ఇందులోచేరి ప్రయోజనము పడయుటకు ఆహ్వానింపబడుచున్నారు.

సమానావశ్యకతను కలుగజేసెడు విద్యావ్యవస్థల ద్వారా అధ్యయన విభాగములు, సేవాదళములు దేశసేవకు యువతరమును యోగ్యతపొందునట్లు చేయవచ్చును.

ప్రొః ఎ. వి. కృష్ణమూర్తి,

అనువాదకుడు:—బి. యన్. మూర్తి.

---

# క్రమ శిక్షణ

పశుత్వములో జీవించుచున్న మానవుని మానవునిగా జీవించుటకు ప్రోత్సహించు క్రమశిక్షణ, విద్య, ఇంద్రియనిగ్రహములవలన సాధ్యమగును. స్వేచ్ఛావిహారము సలిపే గుఱ్ఱములను గట్టిగా పట్టలేకపోతే రథమునకు, రథికునకు, సారథికి ప్రమాదము కలుగును. మనస్సును పగ్గమును అతిజాగ్రత్తగా పట్టుకొని లాగి గుఱ్ఱములను నడిపించిన, మానవుడు మాధవుడు కాగలడు. సత్సంగము, సద్భావము, సచ్చింతనము వలన మాధవత్వానికి సమీపములో చేరుటకు వీలున్నది. ఇట్టి సాధనలు ప్రతిమానవునకు అత్యవసరము.

మానవుడు కొన్నిరకములైన భావములను పెంపొందించుకొనవలెను. రామచరిత్రము మీకు చక్కని మార్గదర్శియగును. బాల్యావస్థలో రామునికి మూడురకములైన స్త్రీలు తటస్థించిరి. మొట్టమొదట రాముడు ప్రధానమైన కర్మకాండను స్వాధీనముచేసుకొన్నాడు. లోక కల్యాణము కొఱకు విశ్వామిత్రుడు సంకల్పించిన యాగమును దుష్టులనుండి రక్షించి ధర్మ సంస్థాపన నిమిత్తమై కంకణము ధరించినాడు. కర్మదోష

లైన రాక్షసుల తల్లి, తమోగుణస్వరూపియైన తాట కిని సంహారము చేసినాడు. రెండవ స్త్రీ రజోగుణ స్వరూపియైన అహల్యకు శాపవిమోచనము చేసి, పవిత్రజీవిగా తీర్చి దిద్ది, భర్త గౌతముని ఓదార్చి ఆయ నకు అప్ప జెప్పి ముందుసాగినాడు. మూడవ స్త్రీ సీత, ఆమె శుద్ధసాత్వికస్వరూపి; అతిస్వచ్ఛమైన స్వభావముగలది. సాత్వికస్వరూపుడైన రామునికి శుద్ధసాత్వికమే ప్రియము; కాబట్టి సీతను చేపట్టాడు.

ఇదేరీతిగా ముందు సాత్వికస్వరూపుడైన గుహుని దగ్గర చేర్చినాడు. రజోగుణస్వరూపుడైన సుగ్రీ వుని స్నేహము చేసుకొన్నాడు. తమోగుణములో పుట్టిన విభీషణుని తీర్చి దిద్ది, రాక్షసత్వాన్ని పోగొట్టి భక్తి నొసగి రక్షించినాడు. తమోగుణమువలన, తప్పును ఒప్పుగాను, ఒప్పును తప్పుగాను, భావించి అహంకార అజ్ఞానములలో పడిన కుంభకర్ణుని సంహ రించాడు. ఎవరేమి బుద్ధి చెప్పిన వినక, మూర్ఖత్వము నకు గురియైన రావణుడు సర్వనాశనమును స్వాగతిం చినాడు; రజోగుణమువలన అధఃపతనమొందినాడు. రాముని కోపమునకు గురియై యుద్ధరంగమందు రామ సన్నిధిలో మరణించినాడు. ఇంక, వాలి నిజముగ సాత్విక శత్రు. అంత్యకాలమందు శ్రీరాముని పర దైవమని ఆరాధించి తన తప్పును ఒప్పుకొని క్షమింపు మని ప్రార్థించినాడు.

ఈ వయస్సులో మీరు సాధ్యమైనంతవరకు తమో గుణమును త్యజించి, రజోభావములను అణగద్రొక్కి సాత్వికమును అభివృద్ధిపరచుకొనవలెను. ఇదే దైవాజ్ఞ. రామాజ్ఞను లక్ష్మణుడు ఎంత శ్రద్ధతోటూచా తప్పక ఏట్లా అనుసరించినాడు, గమనించండి. తనకు సహిం చలేని దుఃఖము కలిగించిననూ, లంకలో సీతాదేవి యొక్క పరీక్షకొరకు, అగ్నికుండమును సిద్ధ పరచి నాడు. నిండుగర్భముధరించిన సీతను ఏకాకినిగా విడిచి పెట్టే కిరాతపుపనిని నిర్వహించినాడు. ఏదైతే ఏమి? రామాజ్ఞ అని కర్తవ్యదృష్టిచే నెరవేర్చినాడు. లోలోపల కుమిలి పోయినాడు; అయితే, అగ్ని అయితేనేమి? అరణ్యమైతేనేమి? మంచి చెడ్డ, పర మాత్మునికి తెలుసు, అని తాను ఆజ్ఞను పరిపాలించి నాడు.

కడకు లక్ష్మణునకూ వచ్చినది—పెద్దపరీక్ష:— రామాజ్ఞను మీరవలసిన సంఘటన: కాలస్వరూపు డైన రుద్రుడు స్వస్థానమును తిరిగి చేరవలసినముహూ ర్తమాసన్నమైనదని, రామునికి తెలుపుటకు వచ్చినాడు. అప్పుడు రాముడు లక్ష్మణుని పిలిచి, "ద్వారముదగ్గ రనే ఉండుము. ఎవరినీ రానీయకుము, ఎవరినీ లోనికి విడువవలదు" అని ఆజ్ఞాపించినాడు. దురదృష్ట వశాత్తు, అదే సమయానికి, దూర్వాసమహర్షి ఆగ మించి వాకిలి తెరువమన్నాడు. లక్ష్మణుడు అతనిని గట్టిగానిరోధించి, కాళ్ళమీద పడి, చాలా ప్రాధేయ పడి, ఆగుమని ప్రార్థించినాడు. దూర్వాసుని కోప మంటే సామాన్యమా? ఆయన శాపమునకై సిద్ధమై నాడు. "నిన్ను, ఈ అయోధ్యలోని సమస్తప్రజానీక మునూ భస్మంచేస్తాను," అని బెదిరించినాడు. ఉత్తమ చిత్తము కలిగిన లక్ష్మణుడు, "రామునిద్వారా నేను భస్మమైనామంచిదే, నాద్వారా అయోధ్యాప్రజలు భస్మము కాకూడదు", అని నిశ్చయించి, వాకిలి తెరచి మహ ర్షికి ప్రవేశమిచ్చినాడు. రామాజ్ఞను మీరి, ఆదిశేషు డైన లక్ష్మణుడు తన స్వస్థానమును ముందుగనే చేరి నాడు

ఈశ్వర సంకల్పమువలననే ఆ దూర్వాసాగమ నము కూడనయినది. ఇది సామాన్యులకు అర్థము కాదు. క్షణములో జగమెల్ల వింతగా మార్చవీల గును, అంత శక్తివంతమైనది సంకల్పము. దైవస్వరూ పము—ఇట్టిది అట్టిది అని చెప్పేమానవుడు ఇంత

రకూ పుట్టలేదు, ఇకముందు పుట్టబోడు; ఏదో వారి వారి ఊహాబలమునననుసరించి, వారి వారికి తోచినట్లు వివరింతురేకానీ, వారు చూచినదితక్కువ, చూడనిది చాల ఎక్కువ. నాచేతిలోని కర్చీపుయొక్క కొనను ప్రేక్షనందులో చూపించినచో, దాని పూర్ణస్వరూపము గురించి మీరు ఏమి చెప్పగలరు?

భగవంతుని చర్య సర్వులకు సమముగానే ఉండును. దీనిని కూడ మీరు గుర్తించలేకపోతున్నారు. సాయియొక్క దివ్యశక్తి, ప్రేమతత్వము, ఘనకార్యములు వీటిని అర్థంచేసుకొనుట అసాధ్యమైన పని. ఉదాహరణమునకు:—ఈ విద్యానిలయమును గురించి సాయిసంకల్పమే వేరు. మీయూహయే వేరు. స్వామి ప్రత్యేకించి ఈ కళాశాలను స్థాపించుటలోని అంతరార్థమేమి? మానవత్వములోనున్న దివ్యత్వమును ప్రకటించుటకొరకు, మిమ్ములను ప్రోత్సహించుట కొరకు ఈ కళాశాల. లౌకికవిద్యను చూపి, దానికై ఆకర్షించి, ఆధ్యాత్మికమునందు ప్రవేశపెట్టుటకై స్థాపించడమైనది. ఈ కళాశాల, యశోద కృష్ణుని పట్టుటకు వెన్నచూపించి, వెనుక కఱ్ఱ పెట్టుకొని వెళ్ళిందట. సాయిమాత ఇప్పుడు విద్య వెన్నగా, క్రమశిక్షణ కఱ్ఱగా పెట్టుకొని పిలుచుచున్నది.

రజోగుణములో పుట్టి పెరిగి, తమోగుణములను హృదయమందు మిశ్రముచేసుకొని, వివిధప్రాంతాల నుంచి వివిధ అభ్యాసాలను అలవరించుకొని, వివిధ సాంప్రదాయాలననుసరించే పిల్లలు కఱ్ఱ చూపించిన దగ్గరకురారు. దీనికే వెన్న, లౌకికవిద్య, డిగ్రీలు, లోకులు వారి వారి గుణస్వభావమునుబట్టి నిర్ణయింతురు. కృష్ణుని లీలలు, మహిమలు వీటిని కంసుడు మ్యాజిక్ అన్నాడు. ఎక్కడచూచిననూ ఆయనకు కృష్ణుడే కనుపించినాడు. దానినికూడ ఆయన రజోగుణముయొక్క ప్రభావమువలన గారడి అన్నాడు. ఇట్టి వారు యుగ యుగములు వెంటాడుతూ వచ్చారు. ఈ యుగములోకూడ లేకపోలేదు విభూతి చంకల నుంచి వస్తున్నదా? అని వివేకశూన్యులు తమోగుణము వాళ్ళు శంకించుచున్నారు. చేతులలోనే పెట్టుకున్నాడా? చేతులు ఆడుతూ పాడుతూ ఉన్నవే? అని, రజోగుణము కలిగిన వారు సందేహింతురు. కాని సాత్విక స్వభావమును, అభివృద్ధిపరచుకోవాలి.

ఇప్పుడు ఐదు సంవత్సరములు ఈ హాస్టలులో నివసించి చదువులోనూ, సేవాకార్యములలోనూ, భజన మొదలగు ఆధ్యాత్మిక సాధనలలోనూ చక్కని ఆదర్శములను సాధించిన ఐదు విద్యార్థులకు నేను ప్రసాదము నందించుచున్నాను. ఇదిగో, ఈ అబ్బాయికి ఒక బంగారు వాచ్ సృష్టించి ఇస్తున్నాను. ఇన్ని శ్రమలకు ఓర్చి బాగుగా చదివి సంతోషముగా, నెమ్మదిగా, క్రమశిక్షణలననుసరించి వీరు మంచిగుణమును పోషించుకొన్నారు, హాస్టలులోని గురువులకు సంతృప్తితెచ్చారు.

విద్యతోపాటు విశాలహృదయము, పవిత్రభావము, నిస్వార్థసేవ వీటినికూడ సంపాదించవలెను. అందరూ ఒక తల్లి బిడ్డలు అనే సమ భావమును పెంచుకోవాలి. పరులకు మంచి సేవ చెయ్యాలి. ఆజ్ఞను సర్వస్వముగా భావించిన ఎన్నటికైనా క్షేమమే అని నిర్ణయించుకోవాలి. సాయిని పొందేనిమిత్తం, దేశం నిమిత్తం, సర్వమానవుల పురోభివృద్ధి నిమిత్తం క్రమశిక్షణ అత్యవసరము.

—భగవానుని దివ్యసందేశము.

బృందావనములోని విద్యార్థినిలయము 30-3-80.

# ఆనందపిపాస

మానవుని హృదయము తీవ్రమైన ఒక అపేక్ష కలిగియుండును. అది అచంచలమైన, స్థిరమైన ఆనందాభీష్టము. ఇట్టి ఆనందమును పొందుటకు ప్రతి మానవుడు రాత్రింబవళ్ళు విధివిరామము లేకుండా కృషి సలుపుతున్నాడు. కానీ దానిని అందుకోలేక పోతున్నాడు. కారణమేమిటి? దేహేంద్రియములే తానని భావించి, ఆనందమే తాను అనే సత్యాన్ని గుర్తించుకోలేక పోతున్నాడు. దీనినే ఉపనిషత్తులు చక్కని ఉపమానము చేత ఈ సందియమును నివారణగావిస్తూ వచ్చింది. పిండియందు బెల్లముచేరినప్పుడే మాధుర్యముగా, రుచిగామార్చుతున్నది; ప్రపంచము పిండి వంటిది. ఈ పిండియందు ఎక్కడ దీనిమాధుర్యమును చూపినప్పటికినీ దివ్యత్వాన్ని అనుభవించినప్పటికినీ, ఇదికేవలము దైవము యొక్క సంపదయే కానీ ప్రకృతియొక్క సంపదకాదు.

భగవంతునికి అప్రమేయుడు అని పేరు. అప్రమేయుడనగా ఎట్టిప్రమాణముల చేతనూ నిరూపించడానికి వీలుకానివాడు అని అర్థము. వేదములచేతనే దీనిని అర్థముగావించుకొనుటకు వీలగును, కనుకనే ఇతనికి 'వేదవిదుడు' అని మరొకపేరు. ప్రమాణములు:—మూడు విధములైనటువంటి ప్రమాణములు కలవు. ప్రత్యక్ష ప్రమాణము, అనుమానప్రమాణము, శబ్దప్రమాణము. ప్రత్యక్షప్రమాణము;—పాలు తోడు పెట్టగా అది పెరుగుగా మారుచున్నది, ఇది ప్రత్యక్ష ప్రమాణము, దూరమునందున్న పర్వతము పైన పొగను చూచి, నిప్పు ఉన్నది అని సందేహించడం; ఇది అనుమానప్రమాణం. ఇంక శబ్దప్రమాణము: ఈ శబ్దప్రమాణమనగా ప్రశాంతినిలయమును చూచినట్టి వ్యక్తి, ప్రశాంతినిలయమును చూడని వ్యక్తిదగ్గరకు పోయి దానిని వర్ణనలు చేయడం చేత, ఆ వ్యక్తి కూడా ప్రశాంతినిలయము యొక్క పరిస్థితిని గుర్తించుతాడు. ఈశబ్దప్రమాణమనేది అనుభవించి ఆనందించి అందించే పలుకుల యొక్క స్వరూపము.

ఇన్నివేలమందిలో ఏదో ఒకవ్యక్తి అమెరికానుండి వచ్చాడు, అతను సత్యసాయి వరల్డ్‌కౌన్సిల్లో ఒక మెంబరు డిగ్‌బాక్ అనే వ్యక్తి. అతనియొక్క గుర్తులన్నియూ విపులంగా చెప్పటంచేత అతనిని గుర్తించడంకూడ కష్టము. అయితే, శబ్దస్వరూపమైన "డిగ్ బాక్" అని నేను పిలిచేసరికి ఎక్కడ ఉన్ననూ ఆ డిగ్ బాక్ లేచి నిలుస్తాడు, అదేవిధముగనే భగవంతునకు శబ్దప్రమాణము. వర్ణనల చేత అంతసులభంగా చిక్కేవాడుకాదు. ఈ శబ్దప్రమాణమనే దానికి రెండు లక్షణములున్నాయి: 1. తటస్థ లక్షణము 2. స్వరూప లక్షణము. తటస్థలక్షణమనగా తాత్కాలికమైన గుర్తును నిరూపించి శాశ్వత స్వరూపాన్ని చెప్పడం; దీనికి చక్కని ఉదాహరణము—ఆకాకి కూర్చున్న ఇల్లు ఫలానవారియిల్లు అని మనం చెపుతాము. అది కేవలం తాత్కాలికంగా గుర్తును చూపించేటువంటిదేకానీ ఆ కాకి నిరంతరము ఆ గృహముపైనివసించదు. కనుక ఈ తటస్థలక్షణములచేత భగవంతుని, రాముడు, కృష్ణుడు, ఈశ్వరుడు, విష్ణువు, అల్లా అనే స్వరూపములచేత తాత్కాలికంగా మనము భావిస్తూ, ఆరాధిస్తూ, ఆనందిస్తూ ఉంటున్నాము. ఇవి కేవలం తటస్థలక్షణ

ములు అనగా శాశ్వతమైన స్వరూపములు కావు. ఇవి లోకకల్యాణము, ధర్మస్థాపన, లోకసంరక్షణ మానవా దర్శముల నిమిత్తమై ఏర్పడే ఆకారములు మాత్రమే.

స్వరూపలక్షణమనగా "సత్యజ్ఞానమనంతంబ్రహ్మ "సత్యం బ్రహ్మ", "జ్ఞానం బ్రహ్మ", "అనంతం బ్రహ్మ". దేశకాలపాత్రలకు అతీతమైన స్వరూప ములు ఇవి. అతీతమైనప్పటికినీ దేశకాలపాత్ర లందు ప్రవేశించి, ప్రకాశించి, ప్రచురించి, ఆనంద స్వరూపము నందిస్తున్నవి.

ప్రపంచమునందలి ప్రతి పదార్థమునందూ ఐదు లక్షణములుంటున్నవి. ఈ ఐదు కూడనూ అస్తి, భాతి, ప్రియ, రూప, నామములు. అస్తి అనగా ఒక వస్తువు ఉన్నది అని నిరూపించడము. అయితే వస్తువు ఉండి నప్పటికినీ, దానిని నిరూపించుటకు ప్రకాశము అత్యవ సరము, ప్రకాశమే లేకుండిన, ఉన్నదని నిర్ణయము చేసుకొనలేము. వస్తువు ఉన్నది అని అనుకోవడము కేవలము 'అస్తి' శబ్దము. వస్తువును ప్రకాశింప చేయు నది 'భాతి' అనేశబ్దము

సమయస్ఫూర్తిగా మనము ప్రేమిస్తున్నాము కానీ సర్వదా సర్వత్రా ప్రేమించడంలేదు. ఆకలిసమ యము నందు అన్నమును, అతిగాప్రేమిస్తున్నాము. పట్టెడు అన్నము పొట్టకు చేరెనా ఆకలి తీరుతుంది. తరువాత అన్నమును ఆశించము. అయితే ఆకలికిపూర్వ ము ఉండిన రుచియే నీ ఆకలి తీరిన తరువాతకూడా ఆ అన్నము నందుంటున్నది. కనుక అన్నముయొక్క స్వరూపతత్వము ప్రియతత్వము! ఈ అస్తి, భాతి, పియము ఈ మూడునూ దైవలక్షణములు. రూప నామములు మాయాకల్పితములు. ఈ మాయాకల్పిత మైన రూపనామములయందు కూడనూ అస్తి, భాతి, పియ స్వరూపమైన దైవత్వము సర్వత్రా నిమిడియు న్నది. జగత్తునందు ఏపదార్థమునకైననూ ఒకకర్త లేకుండా అది నిర్మాణం అవడం జరుగదు. ఏదో ఒక ప్రదేశమునందు, ఏదో ఒకరూపమునందు ఆ పదార్థము యొక్క కర్త ఉండియే ఉండవచ్చును. ప్రాపంచిక సంబంధమైన పదార్థములకు కర్త ఎవరో నిర్ణయించు కోవడానికి సాధ్యమవుతుంది. సూర్య చంద్రాదులు నక్షత్రములు, భూమి, సముద్రము, వీటన్నిటికీ ఎవరో ఒకకర్త ఉండి తీరవలెనుకదా? కనుక సృష్టికి పూర్వమే ఒక కర్త అనే దైవత్వము ఉన్నదనే సత్యమును విశ్వ సించక తప్పదు. ఉపాదాన కారణము, నిమిత్తకార ణము అని రెండు కారణములుంటున్నవి. ఉపాదాన కారణమనేది ఉండినప్పుడే నిమిత్తకారణము ఏర్పడు టకు వీలుంది. ఇది సిల్వర్ ప్లేటు. ఈ సిల్వర్ ప్లేటును చేసినవాడు కంసలి. అయితే ఈ కంసలి వెండియే లేకుండిన తట్టను ఏవిధముగా చేయగలడు? కనుక తట్టకు పూర్వముండిన సిల్వర్ ఉపాదానకారణము. ఆ సిల్వర్ ఉన్నప్పుడే నిమిత్తకారకుడైన కంసలి దీనికొక స్వరూపాన్ని అందిస్తునాడు. కనుక అన్నిటికి పూర్వ మున్న మూలాధారమైనదే ఉపాదానకారణము. ఈ కారణమునకు కర్తయే దైవము. కనుక ఆనందమనేది ప్రతి పదార్థమునందు ఉన్నది. కేవలము ఏదో ఒక ప్రదే శము నందు, ఒక మార్గమునందు మాత్రమే ఆనంద మును అనుభవించగలమని ఆశించడము అజ్ఞానం.

ఏ మానవుడైననూ తనజీవితములో ఆశించు నది రెండు మాత్రమే! మిగిలిన వన్నియు ఆరెండింటి యందే ఇమిడి ఉంటున్నవి. (1) దుఃఖనివృత్తి (2) ఆనందప్రాప్తి. దుఃఖనివృత్తిని కోరనివాడు ఎవడైనా ఉన్నాడా? ఆనందప్రాప్తిని ఆశించని వాడై వడైనా ఉన్నాడా? దీనికే ముక్తిఅనిపేరు. ముక్తి అనగా ఏదో ప్రత్యేక స్థానమనీ, మార్గమనీ భావించి, మాకు ముక్తి అనవసరములేదని అనేకమంది నాస్తికులు వాదిం

వచ్చును, ఆ పదమునకు సరియైన అర్థమును, భావమును గుర్తించకోలేనటువంటి పరమ మూర్ఖుడే 'నాకు ముక్తి వద్దు' అని చెప్పును. ముక్తి అన్నటువంటిది పూర్ణ ఆనందం యొక్కస్థాయియే.

ప్రాపంచికసంబధమైన విషయవాసనలే సర్వంగా భావించుకోవడం, దుఃఖమునకు హేతువు. సర్వము ఆత్మమయము అనే మార్గమును అవలంబించడంచేత నిరంతరము ఆనందమే ప్రాప్తిస్తుంది. అనగా ఆధారమైనటువంటి దీనిని అనుసరించడం చేత, ఆధేయమైన తత్వము మరుగుగా ఉండి ఆనందమే మనకు లభ్యమౌతుంది. కనుక మనము ఏ పదార్థము నందైననూ దైవత్వమైన అస్తి, భాతి, ప్రియము ఈ మూడింటి యొక్క లక్ష్యమును గుర్తుగా ఉంచుకుని తద్వారా మన ము పదార్థమును అనుభవించుకోవడం చేత నిత్యానంద ప్రాప్తి లభ్యమౌతుంది.

భగవానుని దివ్యబోధ.



# భగవాన్

## భూమా

ఉన్నది ఒక్కటే, భూమా అని. ఈ భూమా అనగా త్రికాలములయందు మారని తత్వమునకే భూమా అని యందురు. అలాంటి భూమములో స్వాప్తి జరిపినప్పుడే ఈ ఆత్మ అనే స్వరూపమును సందర్శించుకొనుటకు అవకాశం ఉంటున్నది. భూమిలో నివాసం చేస్తే సందర్శించుకోలేము. రామ కృష్ణాదులను ప్రార్థించినప్పటికి, ఎన్ని రకములైన సుఖములను ఆశించినప్పటికిని ఇవి ఎవరి నిమిత్తము ఆచరిస్తున్నాము అని ఎవరికి వారు ప్రశ్నించుకున్నప్పుడు తనకోసం తాను ఆచరిస్తున్నాడు కాని, లోకంకోసం కాని, తనవారికోసంకాని, మరెవ్వరికోసం కాదని స్పష్టమవుతున్నది. ఒకతను మంచి డ్రస్సు కుట్టించుకోవాలి అని ఆశించినప్పుడు, అలా ఆశించటం డ్రస్సు కోసం ఆశించాడా లేక తనకోసం ఆశించాడా. ఈ డ్రస్సు తనకోసం ఆశించాడు ఇతరుల తృప్తి కోసమని ఆశించటం లేదు. తన తృప్తికోసమని ఆశించుచున్నాడు. ఒక చిన్న బిడ్డ ఉన్నది. ఆ బిడ్డయొక్క రూపాన్ని, నవ్వును చూసి తల్లి ముద్దుపెట్టుకొనుచున్నది. ఆ తల్లియొక్క ముద్దు, బిడ్డ చెప్పేటందుకా లేక తల్లి ఆనందంకోసమా, అది తల్లి ఆనందం కోసమే, అలానే దైవమును నేను ఆశిస్తున్నాను అంటే దైవముకొరకు కాదు నీకొరకు ఆశిస్తున్నావు. కనుక ఏది ఆశించినప్పటికిని తనకోసం తాను ఆశిస్తున్నాడు అని ప్రత్యేకించి నిరూపణచేసినాము.

## నేను

నేను నేను అనేదే అహం బ్రహ్మాస్మి. అహం, అహం అనే వాడు ఎవరో వాడే బ్రహ్మగా ఉంటున్నాడు. ఇది ఎందుకు గుర్తించడంలేదు. ఈ గుర్తించని అజ్ఞానం ఎచ్చటినుండి వచ్చింది? గుర్తించునది ఎచ్చట పుట్టిందో, దానిని మరుగుపరచే అజ్ఞానంకూడ అచ్చటనే పుట్టింది. ప్రకాశమునందించే ఏ సూర్యుడు

ఉంటున్నాడో ఆ సూర్యుని మరుగు పరచే మేఘము లుకూడ సూర్యునినుండే కలుగుతున్నాయి. కర్రను తగులపెట్టే ఏ నిప్పు ఉన్నదో ఆ నిప్పును కప్పే నిమురు కూడను అందులోనుంచే వస్తున్నది. చక్కగ చూడ గలిగిన కన్నులు ఎచ్చటనుండి వచ్చినవో ఆ కన్నులను కప్పేపొరలుకూడ అచ్చటనుండే వచ్చినవి. ప్రజ్ఞాన మైన ఏ ఆత్మ ప్రకాశముకలదో, ఆ ఆత్మనుండే అజ్ఞా నమనే భావము మరుగు పరుస్తున్నది.

నిప్పును గప్పిన నిముఱును 'ఉఫ్' అని ఊదితే ఎలాపోతున్నదో లేక కంటిలోని పొరను ఏవిధంగా శస్త్రచికిత్స చేసి తీసివేసినారో, ఏవిధంగా సూర్యుని కప్పిన మేఘములు గాలి వీచేటప్పటికి తొలగి పోయి సూర్యుని ప్రకాశము మనకు కనుపించుచున్నదో అదే రీతిగనే ఈ ఆత్మ తత్వమును సాధన అనే ప్రక్రియ వలన సందర్శించవచ్చును. కొన్ని సత్కర్మలు చేస్తు న్నాం, పరోపకారములైన అన్నదానములు చేస్తున్నాం ఇవి కూడ ఆధ్యాత్మికమైనటువంటి కార్యములేకదా అంటున్నారు.

## పరోపకారము

ఇలాంటికార్యములు మంచివైనప్పటికిని, ఇవి పరోపకారమనే పేరుతో వినియోగపడుతున్నవి. కాని ఇవి పరోపకారములు కావు. ఇంతకుమునుపు చెప్పి నట్లు, ఏకార్యము చేసినప్పటికిని తనకోసం తాను చేస్తున్నట్లుగా ఈ అన్నదానములు కూడను తనకోసం తాను చేస్తున్నాడు. ఇది ఎలాగు అని కొంతమందికి సందేహం కలుగ వచ్చును. దీనికి చిన్న ఉదాహర ణము.

ఒకవ్యక్తి తాను తన ఆఫీసువాళ్ళందరికి విందుచేసి నాడు, ఇంకా బీదలకు అన్నదానం చేసినాడు. వీళ్ళం దరికి చాల ఆనందం అందించాడు, ఇది పరోపకార సంబంధమైనటువంటిదని చెప్పుకున్నాడు. పరోప కారమనేదానిలో, పరులు అంటే ఏమిటనగా ఎవరు వ్యక్తులు తన యింటికి వచ్చినారో వారంతా పరులంటు న్నాడు. ఆ పరులతో తానుకూడ ఒకడు చేరినాడు గదా: కనుక ఆ పరులతో తానుకూడ ఒకడైనప్పుడు, ఆ ఉపకారము చేసినదానిలో తనకుకూడ భాగమున్నది కదా: ఏ ఏ వ్యక్తికి ఎంతెంత చేసినాడో అంతంత ఫలి తము తనకు కూడ ఉన్నది. కనుక ఇవి స్వయం కృత పనులే కాని పరోపకార సంబంధమైన పనులుగా లెక్క వేసుకోకూడదు. ఇంతమందికి పెట్టినామే అనే భావము ఆ ఆనందముయొక్క ఫలితము రెండు తనకే చెందుతున్నవి. కనుక మనము ఎవ్వరికి ఏపనిచేసి నప్పటికిని, మనకు మనం చేసుకుంటున్నామనే సంపూర్ణ భావముతో మనము గ్రహించవలయును. ఆ విధ మైన విశ్వాసము మానవులలో కలిగినప్పుడు పరులకు చెడ్డచేయుటకు ఎవ్వరును పూనుకోరు. నీ మంచి నీ చెడ్డవల్ల నీకే ఆ ఫలితములు అందుతున్నవిగాని దైవము దీనికి కారకుడు కానేరదు.

నీవు ఏ ధ్వని (sound) చేస్తున్నావో అదే మరల నీకు ప్రతిధ్వనిగా (re-sound) వస్తున్నది. నీవు ఏ action చేస్తున్నావో అదే నీకు reaction వస్తున్నది. కనుక ప్రతి ఒక్కరు కూడను మంచి చేసి మంచిని పొందాలి. చెడ్డను చేస్తే చెడునుపొందు తాము. ఆ విచారణ మన హృదయములో ఉంచే చెడ్డను చేయుటకు మనము ముందంజ వేయము. ఏ కార్యము చేసినప్పటికిని తత్ఫలితము మన హృదయ మునందు పెట్టుకొని చేయకూడదు. ఫలితము ఎప్పుడు హృదయములో పుట్టెనో తిరిగి కోరిక అనే రూపము ధరిస్తుంది. వాంఛ అనేది ఎప్పుడు బయలుదేరిందో ఆ వాంఛకు ఆకారం జనిస్తుంది, అదే మానవా

కారంగా జనిస్తుంది. "పునరపి జననం పునరపి మరణం" అనేదానికి ఆధారమవుతుంది.

## సంకల్పములు

పతిశాపము చేత అహల్యరాయిగా మారిపోయింది. కొన్ని సంవత్సరములపాటు రాయిగానే పడిఉంది. అహల్యరూపము రాయిగా మారిందిగాని అచ్చట అహల్య సంకల్పము మానవాకారంగానేఉంది. రామచంద్రుని పాదము స్పర్శించినంతనే మానవ రూపము ధరించింది. రాయియందు మానవత్వము అనే సంకల్పము కనుక లేకుండా ఉంటే రాముడు దానిని సోకినప్పటికిని అది రాయిగానే పడివుండేది. కాని నాతిగా మారి ఉండేది కాదు. కనుక సంకల్పము లేకుండా నిర్మూలము చేసుకొనవలయును. కాని కారణాంతరములద్వారా సంకల్పములను అరికట్టుకొనిన లాభము లేదు. కనుక ఈ కారణాంతరములురేపే ఈ రూపము మారినప్పటికిని, సదవకాశము ప్రాప్తించినప్పుడు తిరిగి స్వస్వరూపాన్ని ధరించక తప్పదు. కాని యింద్రియ నిగ్రహము చాల ముఖ్యము.

దీనికి రామాయణము మరొక చక్కని ఉదాహరణ నిస్తుంది. రావణుడు శాస్త్రములన్నింటిని క్షుణ్ణంగా సంగ్రహించాడు. చాల గొప్పవాడు. దైవారాధన క్రమము తప్పక చేయుచుండెడివాడు. ప్రతిరోజూ అనేక శివాలయములకు వెళ్ళివస్తూండే వాడు. నాలుగు వేదములయందు ఆరు శాస్త్రములయందు మంచిపాండిత్యము సంపాదించినాడు. అందువలననే అతనికి దశకంఠుడు అని పేరు వచ్చినది. అలాంటి వాని చావుకు మండోదరి చాల దుఃఖించింది. కోతులద్వారా చనిపోయినటువంటి వ్యక్తికి పునర్జన్మముగాదు. మహాపిశాచి జన్మవస్తుందని మహా పాపిగా ఉన్నటువంటి వాడని ఒక శాస్త్రములో చదివిన విషయం ఆమెకు స్ఫురించినది. ఇంత పవిత్రమైన యజ్ఞయాగాదులు సలిపిన రావణుడు కోతులతోనా మరణము అని, అసహ్యము వేసినది. ఆ రావణుని చూచుటకుకూడ అసహ్యము వేసినది. ఇలాంటి పాపిని మహాపుణ్యాత్ముడని నేను విశ్వసించినానే దీనికి ఏమిటి కారణము అని ఒక మహాతపస్విని దగ్గరకు వెళ్ళింది. ఆమె చెప్పింది. అయ్యో, ఎన్ని సాధనలు చేసినప్పటికిని. ఎన్ని యజ్ఞయాగాదులు చేసినప్పటికిని, ఎన్ని వేదములు చదివినప్పటికిని, ఎన్ని శాస్త్రములు తెలుసుకొన్నప్పటికిని, యింద్రియనిగ్రహములేకపోవుట వల్లనే ఈ గతి ప్రాప్తించినదని చెప్పినదట. అందువలన మన వేదాంతమందు చలించే మనస్సు, కళ్ళెములేని గుఱ్ఱము, Brakes లేని కారు, యింద్రియ నిగ్రహములేని సాధన చాల ప్రమాదం అన్నారు.

ఎవరైనా సాయిభక్తుడు ఇలాంటికార్యములు చేస్తున్నాడాయని, అక్షేపణ చేయవచ్చును. కనుక నీవు చలించనటువంటి మనస్సును భ్రమించనటువంటి దృష్టిని, ఈ రెండింటిని అభివృద్ధిపరచుకొనేదే సాధనతో ప్రధానమైన లక్ష్యంగా భావించాలి. మంచికి అనేక ఆటంకములు కలుగుతూనే ఉంటుంటాయి. వాటిని మనం లక్ష్యంచేయగూడదు. ధైర్యంతో సాహసంతో మనసత్వాన్ని వదలక, దృష్టిని చలించక, మనయొక్క గమ్యాన్ని చేరేమార్గాన్నిపూర్తిగా సాధిస్తూ పోవాలి.

—శ్రీవారి దివ్యోపన్యాసమునుంచి

# నిత్య విభూతి

లోకములో సామాన్యమైన ఏ వస్తువులను సంపాదించవలెనన్న, వాటికి తగిన వెలను ఇచ్చుట అత్యవసరం; ఆ త్యాగమునకు ఓర్చుకో వలసివస్తుంది. ఒక వస్తువును త్యాగము చేసి మరొక వస్తువును అందుకో వలసి యున్నది. త్యాగముచేయక, ఆశించటములో అర్థంలేదు. సంయోగ వియోగపూర్వకమైనది ఈ జగద్వ్యవహారము. ఈ నాటి మానవులు నిరంతరం భోగమను ధనమునే ఆశిస్తారు. అవి రెండూ, జీవిత పరమార్థము కానేరవు. ఆనందము కావాలంటే, దుఃఖమును త్యజించాలి; నిత్యమైనది కావాలంటే, అనిత్యమును త్యజించాలి. ఏకత్వమునమభవించాలి అని ఆశించిన, అనేకత్వభావాలను త్యజించాలి. "త్యాగే నైకే అమృతత్వమానశుః," అని ఉపనిషత్తులు బోధిస్తున్నవి. దురాలోచన, దుశ్చింతన, దుర్భావములు, దుర్గుణములు అన్ని పారవేయక, సద్గుణములు, సదాలోచనలు, సద్భావాలు, సచ్చింతనలు కించిత్తైన ప్రవేశించవు. ఈ వయస్సులోనే, మీరు ప్రయత్నపూర్వకముగా సాధించాలి.

ముఖ్యంగా, విద్యయొక్క సార్థకత ఏకత్వసాధన, అని నిర్ణయించుకోవలెను; జీవుడు వేరు, దేవుడు వేరు, అనే ద్వైతభావమును కూడ స్వస్తి చెప్పాలి. సర్వభూతములందూ ఈశ్వరతత్వము ప్రకాశించుచున్నది; ప్రకటితమగుచున్నది, అని శంకరుడు స్పష్టపరిచాడు. ఇట్టి భేదభావమే, బంధన. కొందరు "సైతాన్ వలన ఏర్పడినది మనిషికి బంధనము" అంటారు; కొందరు "మాయవలన జరుగును," కొందరు "అజ్ఞానమువలన పుట్టును" అంటారు. మన లోని దోషమే, బంధనము. దృష్టిదోషమువలన సృష్టిలో దోషము గోచరించి, భేదము కనబడుచున్నది.

సమాన రాహిత్యము భగవంతుని ప్రత్యేకలక్షణము; ఆయనకు సాటిలేదు, రాదు. ఆ దివ్యత్వమునుంచి ఆవిర్భవించినదే, ఈ లీలా విభూతి, అంటే, ఈ ప్రపంచము, ఇవన్నీ భగవంతుని లీలా విశేషములు. ఆ విభూతి ఎప్పటికప్పటికీ నవనవీనము. పదహారువేల ఇండ్లలో పదహారు వేల రూపములందు ఒకే మార్పు లేని శక్తి మారినట్లుగా కనిపించి ప్రకాశించెను. మార్పు లేనిది, ఈశ్వరతత్వము; మార్పుపొందిన స్వరూపము, జగత్తు; అంతేకాని, జగత్తు ఒక ప్రత్యేక విభాగము కాదు. ఈశ్వరత్వములోని అంతర్లీనమైయున్న యోగశక్తివలన ఆయన జగత్తుగా కనబడును. కాబట్టి, "ఈశావాస్య మిదం సర్వం;" ప్రతి మానవునియందు ఈశ్వరాంశమున్నది, దానివల్లనే, మానవుడు శివం; అదిలేకపోతే, మానవుడు శవం, త్రిగుణాత్మకమైన జీవతత్వమందు గుణాతీతుడైనా ఈశ్వరుడున్నాడు, ఈశ్వరుడు నిత్య విభూతి.

సాత్వికగుణమువలన, శాంతి సుఖము సమభావము సహనము లభించును. రజోగుణమువలన సంకల్ప వికల్పములు, కలుగును. తమోగుణమువలన అజ్ఞానము కలుగును. బుద్ధుడు ప్రబోధించినాడు; సర్వందుఃఖం సర్వంక్షణికం, సర్వంశూన్యం. అయితే, సర్వం ఈశ్వరుని లీలా విభూతి అని తెలుసుకొగలిగిన తరువాత ఈభావముండదు. భిన్నతత్వభావం దుఃఖ కారణమగును. ఏకత్వానుభవమువలన ఆనంద ప్రాప్తి, జగత్తు

'౦' (శూన్యం), అయితే ఏకత్వం '1' అనేభావము మనస్సులో దృఢపడిన తరువాత, దానికి 10 కూడ విలువకలుగును.

సహజమైన ఏకత్వమందు అజ్ఞానమువలన పుట్టి పెరిగిన విషయవాసనలు అనేకత్వమును ఆరోపించు చున్నవి. రెండుగజాలు షర్టు గుడ్డ తెచ్చి టైలరు చేతిలో పెట్టి, నాకోక బుష్కోటు కావాలి అనిచెప్తే, ఆ విషయవాసనను పురస్కరించుకొని, ఆయన ఏకత్వములోనున్న గుడ్డని అనేకత్వము చేసి ముక్కలు ముక్కలుగా కత్తిరిస్తాడు. అయితే, అనేకత్వములో ఆనందములేదు, రాదు. మరి, ఆ ముక్కలనుకుట్టి ఇంకొకరీతిగా ఏకత్వం చేయాలి. జగత్తత్వము కూడ అట్టిదే.

ఇదే సార్థక జీవితవిధానమూ, అనేకత్వములో ఏకత్వమును సాధించాలి. లీలా విభూతిని అందించే నిత్యవిభూతిని గుర్తించి నిత్యానందము నందుకోవాలి.

శ్రీవారి దివ్యబోధ విద్యార్థి నిలయం,
బృందావనం.

# పుస్తకములు

| | పేరు | వెల | తపాల ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుతమూర్తి—(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం—అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | ఆత్మారామం | 5-00 | 0-45 |
| 3. | ఆధ్యాత్మికదీపిక | 2-50 | 0-20 |
| 4. | జ్ఞానవాహిని | 1-00 | 0-10 |
| 5. | ధర్మవాహిని | 1-25 | 0-15 |
| 6. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 7. | ప్రశాంతివాహిని | 1-00 | 0-15 |
| 8. | ప్రేమవాహిని | 1-00 | 0-15 |
| 9. | మణిమాల | 2-00 | 0-20 |
| 10. | వచనామృతము (2) | 2-50 | 0-30 |
| 11. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-35 |
| 12. | సత్యం శివం సుందరం (2) | 7-00 | 0-35 |
| 13. | సత్యం శివం సుందరం(3) | 5-00 | 0-35 |
| 14. | సందేహనివారిణి | 2-00 | 0-20 |
| 15. | సూక్తిరసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 16. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 17. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 18. | సువర్ణసుమమాల | 5-00 | 0-30 |
| 19. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |
| 20. | శ్రీ సత్యసాయివచనామృతము(3) | 2-00 | 0-20 |
| 21. | శ్రీ సత్యసాయిదివ్యబోధ | 2-00 | 0-20 |

కర్ణాటక రాజ్యపు బెంగుళూరు—67, బృందావనములోని 'వ్రజ్ బృందావన్ ప్రెస్' నందు పి. చంగ్‌కకోటిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, "శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్" ప్రశాంతి నిలయము, తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి. యం. యే., బి. యల్.

# శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, ప్రశాంతినిలయము,

## పత్రికలు — పుస్తకములకు ఆర్డర్లు.

(1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువకానీ చందాలు స్వీకరింపబడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 5 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 16 | | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | | | 18 | | 18 |
| అమెరికా | 16 | 51 | | 20 | | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | | 14 | | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | | 12 |
| యూరప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏభాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలయును. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రస్సు నందు మార్పు అవసరమని తెలుపు సమయము నందును చందా నంబరును వ్రాసి పంపవలయును.

B (1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు. ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్డ్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డరుతో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డరులోనే తెలుపవలయును.

(3) ఫోటోలు/చిత్రములు. పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకొనవలెనన్న మీ చిరునామాగల స్టాంపు వేసిన కవరును పంపవలయును.

(5) పుస్తకముల ఆర్డరులు—విదేశములనుంచి తపాల ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతినిలయము, అనంతపురం జిల్లా ఆంధ్రప్రదేశ్-పిన్:515134, యొక్క చిరునామాకే పంపవలయును. మనియార్డర్ పంపువారు వెనుకభాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలయును.

188[illegible] పుటలో చూడండి)

Regd. No. KRNU—83 JULY

భగవంతుడు లేడంటే నీవులేనట్లే. దేవుడులేడనే వారు కూడా నేను వున్నాను అంటారు. అయితే వున్నాను అనే నేను ఎవరు? శారీరక, మానసిక పరిణామాలలో సుఖదుఃఖాలలో మార్పు చెందకుండా వుండేది నేను. నేను అనేదే దైవం అని నమ్మండి. కళ్ళతో చూస్తూ, నాలుకతో రుచి చూస్తూ కాళ్ళతో కదులుతూ ఆలోచనతో తర్కిస్తూవున్నది ఆ నేను. ఇవి నావే కాని నేను వేరు అనే భావం నిరంతరమూ మెదులుతూ వుంటుంది. నాస్తికులుకూడా ముందుగా అస్తి అని తరువాత నాస్తి అంటారు. న+ అస్తి—నాస్తి అవుతున్నది. అస్తి లేకుండా నాస్తి అవటానికి వీలులేదు. నేను అనేది ప్రత్యేకంకాదు, పరమాత్ముడనే సముద్రంలో ఒక తరంగం.

Regd. with Registrar of Newspapers No. RN/10772/64